శ్రీ

# రామకృష్ణ పరమహంస

## జీవితము

రచయిత:

శ్రీ మల్లాది



ప్రచురణ:

పసుపులేటి బాపిరాజు,

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

1947.

 వెల రు. 0—12—0

# మున్నుడి.

"శమము దమము నహింసయు సత్యదీక్ష
తపశ్శక్తియు మతసన్నివేశతాప్రతిభ
లాజన్మసాంప్రదాయంబు లెచట
నట్టిభారతధాత్రి పుణ్యప్రదాత్రి."

భారతవర్షంబున శమము, దమము, అహింసయు, సత్యదీక్షయు, తపశ్శక్తియు, మతాభిమానము, మతసన్నివేశము, మతప్రతిభ మున్నగునవి యాజన్మసంప్రదాయములుగ నుండుటబట్టియే భారతభూమి పుణ్యప్రదాత్రియని ఖండఖండాంతరములందుగూడ వ్యాప్తినందుటే కాదికారణముగ నెన్నబడుచున్నది. ఈదివ్యభారతవిశాలసుక్షేత్రమున నెన్నిపరిపాలనము లెప్పుడెప్పుడు సాగి యెంతమంది పరిపాలకులు ప్రజారంజకముగ పాలించి యశఃకాయముల నిట విడచి స్వర్గసీమ కరిగిరో యాప్రాచీనపుచారిత్రకసంఘటనలను హృదయసీమ దలంచినచో మేని మేను జలదరించి రక్తనాళము లొప్పొంగక మానవు. ఆమాంధాతాదిమహీపతుల సుస్థిరవాల్లభ్యము, యుధిష్ఠిరాది భూమీశుల రాజకీయవిజ్ఞానసంపద, రాజరాజనరేంద్రుడు మున్నగుభూజానుల చారిత్రకదివ్యవీక్షణాసక్తత భోజభూపాలుని దాతృతాగరిమ, కృష్ణదేవరాయని తేజివారిసంచలనలు, ఛత్రపతిశివాజీమహారాజుయొక్క మాతృదేశారాధన, ప్రతాప

రుద్రగజపతి శౌర్యభంగిమలు, బాలనాయనిబలప్రతాపశౌర్య విజృంభణము, రుద్రమదేవియున్నగు క్షత్రియకాంతాలలామల యశశ్శంకితప్రతాపము, మొక్కవోనికాకతీయక్షత్రియుల పౌలి కలనిలోని రక్తప్రవంతులు, చాణక్యయుగంధరాదిమహా మంత్రుల మంత్రశక్తియు నీభారతదేశమున నొకప్పుడు పుంజీ భూతములై నేను స్వప్నప్రాయములేయైనను భారతీయుల ఆచారపుఔన్నత్యము నీపమేనియు బీసరవోవలేదు.

అయితే మతపరిణామతరంగములు భారతవర్షమహా సాగరమును కల్లోలితము గావింపకుండ నుండలేదు. వేయి సంవత్సరములనుండి యించుమించుగా పరపాలనాప్రబంధిత యైయుండియు మతవిషయమున నేవో పరిణామసంఘటనలు ప్రాప్తించుచున్న నెప్పటి కప్పు డావ్రతకదంబమును భేదించు మహనీయు లుద్భవించి తీర్చిదిద్దుచున్నారు. అట్టివారిలో శంకరాచార్యులు, శ్రీరామానుజాచార్యులు, మధ్వాచార్యులు, మహమ్మద్ప్రవక్త, ఏసుప్రభువుమున్నగువారికి పిమ్మట నింకను మతపరిణామతీవ్రమును దీపింప హిందూదేశమున స్వామిదయా నందసరస్వతి, శ్రీచైతన్యస్వామి, మహర్షిదేవేంద్రనాథఠాకూరు, కేశవచంద్రసేనుడు, శ్రీరామకృష్ణపరమహంస, శ్రీవివేకానంద స్వామి, శ్రీరాజారామమోహనరాయివంటివారు ప్రభవిల్లి యుండిరి. వారివారిమాశయములలో నొకించుక భేదభావ మున్నను ప్రధానాశయము మతసుస్థిరత్వమే. ఆమహనీయుల మతవిశ్వాసచిహ్నితములైన తేజఃకిరణములు భారతభూమి

నంతను నాకర్షించి మిన్ను మన్ను లేకముచేయగల ప్రమాద పూరితఘట్టములు పరిఢవిల్లినను భిన్న భిన్నములుగ చేయగలుగు చున్నవి.

19 వ శతాబ్దాంతమున భారతవర్షమున మతప్రబోధ బీజములను వెదజల్లిన సుకృతజీవనులలో శ్రీరామకృష్ణపరమ హంస యగ్రగణ్యు డనవచ్చును. బాల్యమునందే ప్రాపంచిక భోగములపై మమతవీడి పరమేశ్వరభక్తులుగా జీవయాత్ర గడపిన వేనవేలు తపోదీక్షానిరతులలో కాంచనజయము నందిన వారు శ్రీరామకృష్ణపరమహంసకంటె వేరొక్కరు లేరు. అందు వలననే యాతడు భరతఖండమునందేగాక యావత్ప్రపంచము నందును నేడు మతములరూపమునను, సంస్థలరూపమునను, శిష్యపరంపరల రూపమునను రూపొందియున్నాడు. శ్రీస్వామి వివేకానందునివంటి విద్యావాచస్పతికి గురువై మఱియు వేల కొలది శిష్యప్రపంచమును ప్రపంచమున నిలిపి తాను యశః కాయుడై నిలచియున్న శ్రీరామకృష్ణపరమహంసవంటి మత పరిణామతత్వవేత్తల జీవితములను నేటియువకులు పఠన పాఠములు గావించి యందలిలవలేశమైనను జీర్ణించుకొంటిరేని పాశ్చాత్యనాగరిక శాశృంఖలములనుండి బయలుపడ నవకాశము తటస్థించును.

మేము నేడిపుడు దేశము నావరించియున్న రాజకీ యాంధకారమునకు రేవెలుంగులైన రాజకీయనాయకుల జీవిత

ముల నన్నింటిని వరుసక్రమముల గూర్చి ప్రకటించుచున్నాము. ప్రకటింపనున్నాము. ఆరాజకీయనాయకుల జీవితములతో బాటు ప్రాచీనభారతవర్షమున నేనాఁడో మతాకిరణములను వెదజల్లి పోయిన ప్రాచీనాధునికమతప్రబోధకుల జీవితచరిత్రములను గూడ ప్రజాసామాన్యమున కందుబాటుగ నుండునట్లు సరసమైన వెలలతో నాంధ్రమహాశయుల కిచ్చి భాషామత సాంప్రదాయముల విశిష్టతను జాటయత్నించు మాయీకృషి కితోధికముగా నాంధ్రప్రజానీకము చేయూత నొసంగునని విశ్వసించుచున్నాము.

ఇట్లు,
ప్రకటనకర్త.

# ప్రస్తావన.

"భరతఖండంబు—భువనైకపావనంబు"

భారతదేశము ప్రపంచమున కంతకు నాదర్శకప్రాయమై జగన్నుతిగన్న ప్రాజ్యసామ్రాజ్యవైభవవిరాజితము. నానా కళావిత్తమజ్ఞానసంపత్తి కాచార్యకస్థానము. అన్యదేశప్రజా యత్నసాధ్యముకాని చతురకార్మికపరిశ్రమలకు బుట్టినిల్లు. ప్రబలసప్తద్వీపపర్యంతవిశ్రాంతమైన భూరివాణిజ్యసంభూతి కగ్రస్థానము. ఈమాటలను ప్రాచ్యప్రతీచీఖండమందలి విజ్ఞానవేత్తలంగీకరించినవే. కాని యీవైభవమంతయు నంతరించి నేడు పలువిధంబులైన సస్యములకు దావలమయ్యు క్షామదేవతకు వాస్తవ్యమై, కనకరత్నకదంబముల కాకరమయ్యు గర్భదారిద్ర్యమునకే నిలయమై, మూడువైపుల సముద్రంబులు మొనయుచున్నను ఉప్పునకు గొఱగాని హైన్య మనుభవించునదై, పట్టునకు, ప్రత్తికి ఆటపట్టయ్యును, పెరనాటికట్టుబట్టలకే యఱ్ఱులు సాచినదై యన్నియు నంగడు లందున్నను నల్లునోట గడ్డయే యన్నసామెతకు తార్కాణమై, కల్పతరువయ్యు నన్నమో రామచంద్రాయను నాఱుకోట్లకు మించిన దీనుల యారాటమునకు స్థానభూతమై గర్భనిర్భేద్యమగు దుర్భరస్థితిలో నుండుట జగ మెఱింగినదే.

ఇట్లయ్యును గొన్ని విషయములందు నేటికిని జగత్తున కంతకు నాదర్శక ప్రాయికముగ నున్నదనుటలో నతిశయోక్తి లేదు. అందు ముఖ్యముగా భౌతికాధ్యాత్మిక విజ్ఞానములందు తన ప్రాచీనపు ఔన్నత్యము నించుకయినను గోలుపోక మతప్రవక్తలకును, ఆధ్యాత్మిక వేత్తలకును నిలయమై యలరారుచున్నది. భరతఖండమున ప్రతికాలమందును మతోద్ధరణకై మహాపురుషు లుద్భవించి మతలోపములను సవరించుచు నాయాకాలపరిస్థితులను బట్టి వానిధర్మంబులను, ఆచారములను సవరించి, కట్టుబాట్ల నేర్పరిచి తీర్చిదిద్దుచునే యున్నారు. అయినను భారతదేశ దౌర్భాగ్యముచే పరపాలకుల హస్తంగతమై వారియాచారముల ననుకరించుచు భారతీయులలో పరమతావేశపూరితు లగుటయు, మతసంస్కర్తలు మరల మరల జన్మించుటయు నాచారముగాను, సాంప్రదాయసిద్ధముగాను వచ్చుచున్నది. 19 వ శతాబ్దమున భారతదేశమందలి మతలోపములను సవరించి, భారతీయుల నుద్ధరించి, మతధర్మములను నెలకొల్పుటకును, పరమతధర్మాచరణము వరికట్టుటకును కొందఱు మహనీయులు జన్మించియున్నారు.

అట్టివారిలో నగ్రస్థాన మలంకరింప దగినవారు చాలమంది భారతదేశమందలి విజ్ఞానసీమలం దొక్కటయిన వంగదేశమునందే యుద్భవించుటయు నాదేశమునకేగాక భరతఖండమున కంతకు దివ్యసందేశము నిచ్చుటయు పరిపాటయినది. అట్టివారిలో నధికమతావేశనిష్ణాత యనిపించుకోదగినవాడు

శ్రీరామకృష్ణపరమహంస యొకడు. ఆయన వేదకుటుంబములో జన్మించాడు. ఈకాలంలో నీచంగా ఎంచబడే గుడిపూజారిగా వున్నాడు కొంతకాలం. అయితే యీనాటిగుడిపూజారులవలె దురాశాపీడితుడుగాక, దురాచారవృత్తుడుగాక కేవలం దేవర్చకునివలె మెలగినాడు. పేటిపూజారుల ఏహ్యకృత్యాలు వచింపరానివి, లిఖింపరానివిగా నున్నాయి. పూజారి కడుపు నిండినతర్వాతే దేవుడికడుపుసంగతి చూడటం-తనభోగవిలాసాలు పూర్తి అయినతర్వాతనే దేవునికి భోగవిలాసాలు నెఱవడం-తనగుప్పెటనిండితేనే భక్తునికి దేవునిదర్శనం. అడుగ్గడుక్కే లంచాలు-ఈపూజారులదుష్కృత్యాలవల్లనే దేవళ్ళుకూడా అక్రమములైన అపవాదలకు పాల్పడవలసివస్తోంది. బాల్యంలో గంగాధరుడుగా పుట్టిన యీగుడిపూజారే కాంతాకాంచనములందలి మోహనిర్మూలనం జేసికొని, యీదేవినే కొల్చికొల్చి ప్రసన్నురాలి గావించుకొని తుద కాదేవినే గుప్పెటలో నిముడ్చుకొని శ్రీరామకృష్ణుడై ప్రపంచానికి నిజమైన ఆధ్యాత్మికతత్వాన్నుద్బోధించి జీవితకాలమంతా మతదీక్షకు, దేవ్యారాధనకు, దేశసేవకు ధారవోసి, ప్రపంచమున్నంతకాలము తనయశస్సును, భారతదేశయశస్సును శాశ్వతంగా నిలుపగల వివేకానందస్వామివంటి శిష్యకోటిని తయారుచేయగలిగాడు. ఆహా! ఒక్కమానవునిజీవితపరిశిష్టతలో నెంత మహత్వం, దివ్యత్వ ఇమిడి యున్నాయో చూడాలంటే రామకృష్ణజీవితఘట్టాలే నిదర్శనాలు. ఆసంఘటనలను ఆధారముగా జేసికొని యీజీవితము వ్రాయబడినది.

---

# విషయానుక్రమణిక



# జననము—వెలుగుదివ్వె.

" పూతగంగోర్మిశీకర శీతలములు
లలితవిద్యాధరాధ్యశిలాతలముల
హిమగిరిస్థానములు నశియించె నొక్కొ-
నరులు నిందిత.......... ...లగుట. "

భారతీయుల దురదృష్టవశమున పందొమ్మిదవశతాబ్దారంభమున పాశ్చాత్యనాగరికతాతరంగము లల్లకల్లోలముగ భారతదేశమంతట నావరింప నారంభించెను. పాశ్చాత్యవిజేతలు భారతజాతి అధఃపతితజాతియనియు, భారతీయులు కార్యశూరత లేనివారనియు, సనాతనధర్మతత్వములు అర్థహీనములయిన ప్రలాపములనియు నిర్ధారణచేయ విశ్వప్రయత్నము లొనర్పసాగిరి. ఈప్రస్తావన దేశమున చెలరేగినంతనే భారతజనసామాన్య మగణ్యమానమగు నాందోళన మొందసాగెను. భారతీయుల జాతీయజీవనము పాశ్చాత్యనాగరికతావేగప్రసారిత ప్రణాళిక ననుసరించి నూతనమార్గము త్రొక్కి-తీరవలయుననెడి యూహాపరంపర దేశమం దంతటను వ్యాప్తి నందెను. భారతీయుల కానుపూర్వికముగా, పరంపరానుగతముగ స్వానుభవపూర్వకమైన యావిశుద్ధజీవనవిధానమంతయు అభగ[illegible]యమను నేకవరాయణత్వ మంతయు, దేశవ్యాప్తమైన యనాత్మ

వాదముచే ఐహికసుఖాన్వేషణబుద్ధితో నిర్మూలన మైపోవు చున్నట్లు కాన్పించెను. భారతజాతీయతయే రూపుమాయు చున్నట్లయ్యెను. సత్యాన్వేషకులు 'ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే' యనువచనము మిథ్యాభూతమా యని యాందోళన మొందనారంభించిరి.

హిందూదేశమున తొల్లిటికాలమునందెగాక యీ కాలమునందుకూడ నెప్పటి కప్పుడు ప్రాపంచికభోగములపై నసహ్యము జనించి బాల్యమునందె విషయసుఖవాంఛారహితులై యీశ్వరభక్తులుగ జీవయాత్ర గడపిన మహాపురుషు లచ్చటచ్చట ప్రత్యక్షమగుచున్నారు. అట్టివారిలో గొందఱు కేవలము ప్రాచీనపద్ధతులననుసరించియే పరమభక్తులయి తాము తరించి యితరులను తరింపజేసినవారు గలరు. మఱికొందఱు ప్రాచీననవీనమార్గముల రెంటిని సమ్మేళన మొనరించియు, వేఱుకొందఱు ప్రాచీనులమార్గమును సంపూర్ణముగా త్యజించి కేవలనూతనమార్గమును ద్రొక్కి ధన్యులైనవారును గలరు. దయానందసరస్వతి, యుభయమార్గగామియయ్యెను. కేశవ చంద్రసేనుడు మున్నగువారు పూర్తిగ క్రొత్తమార్గమును జన సామాన్యమున కనిష్టమైన మతము నవలంబించియు విరాగులైనవారు.

హిందూదేశ మెంతో యల్లకల్లోలముగ నున్నసమయమున మన్మథనామసంవత్సర ఫాల్గుణ శుక్ల ద్వితీయా సౌమ్య

వాసరమునకు సరియైన 18 ఫిబ్రవరి 1836 తేదీని వంగదేశ మందలి హుగ్లీజిల్లాలో నిప్పటి కామార్పుకూర్ (కామారి పుష్కరము) అనుమారుమూల పల్లెటిగ్రామములో నొక బ్రాహ్మణునియింట నొకబాలుడు జన్మించెను. అతనితండ్రి ఖుదీరామచటోపాధ్యాయుడు. తల్లి చంద్రమణీదేవి. ఆదంపతులు పేదకుటుంబీకులయినను గౌరవమర్యాదలలోను, యోగ్యతలలోను, మంచినడవడిలోను ప్రశస్తినొంది గ్రామస్థులందరిచేతను పూజింపబడుచుండిరి. ఆపేదలకుటీరమున బుట్టిన యాశిశు వెట్టిమహత్తరలగ్నమున నేశుభముహూర్తమున జన్మించెనో యానాటిదైవజ్ఞులే యాసమయమును గణితశాస్త్ర దృష్టితో బరికించిరేని యప్పుడే యాతనిభావిసౌభాగ్యపరిస్థితులు గ్రహించియుండెడివారు. అతడు పేదకుటుంబమున జన్మించిన కారణమున నదితటస్థింపలేదు.

జననీజనకు లాబాలుని పేదరికముతోనే పెన్నిధిగ బెంచుకొనుచుండిరి. ఖుదీరామచటోపాధ్యాయుడు నిత్యసత్య వ్రతుడును, దైవభక్తితత్పరుడునై యుండెను. అతడింతకు మున్ను 'దేరీ' యనువేరొకగ్రామమున నివసించుచుండువాడు. ఆయూరిజమీందారు డొకప్పు డితనిని ఒకవిషయమున దప్పుడు సాక్ష్య మిమ్మనియు, నట్లిచ్చిన నీపేదఱికమును బాపుదునని, ఈయకుంటివేని యవస్థలపా లొనరింతునని బెదరించి ఆజమీందారు బలవంతు డగుటచే సాక్ష్యము చెప్పనిచో నన్ను చిక్కులపాలు చేయక మానడని, తప్పుడుసాక్ష్య మీయ

శిష్టపడక యొకనాటిరాత్రి యాగ్రామమును విడచి కామార్పుకూరమును జేరుకొనెను. ఆతనిసత్యసంధత కిదితార్కాణగదా?

ఒకప్పుడు ఖుదీరామచటోపాధ్యాయుడు తనకుమార్తెను జూచుటకై కాలినడకను దూరదేశమునకు బోవుచుండగా మహామహంతులు పయనము సాగునప్పటికి మార్గమధ్యమున నొక్కచో నతనికి, క్రొత్తగా చిగిర్చిన దళములుగల మారేడు చెట్టొక్కటి గాన్పించెను. దానిని గాంచినతోడనే మిగుల సంతోషముతో ముందునకు బోలేక యాదళములతో శివపూజ చేయుట తన కత్యంతప్రియతమమగుట ప్రయాణమింకొకప్పుడు చేయవచ్చును. ఈదళములను గోసికొని పోయి శివపూజ కావించెదను. నేను మరల తిరిగివచ్చుసరి కీదళముల నెవ్వరయిన శివభక్తులు గొనిపోదురేమోయని యాదళములను గోసికొని వెనుదిరిగి యిల్లుచేరి మనసార శివుని బిల్వదళములతో బూజించి సంతుష్టి నందెను.

మఱొకప్పుడు చటోపాధ్యాయుడు తీర్థయాత్రలను సేవించుచు క్రమముగా గయకు బోయి యాక్షేత్రమున జేయవలసిన కృత్యముల నన్నిటిని పూర్తిగావించుకొని ముందునకు బోవనుండనున్న కడపటిరాత్రి యతనికి గదాధరుడగు విష్ణువు స్వప్నమున సాక్షాత్కరించి నీదైవభక్తితత్పరత కానందంబు గలిగి కొలదికాలములో నీకు కుమారుడనై జన్మింపనుంటినని వచించెనట. ఈతనిదైవభక్తితత్పరత కీపై రెండును సాక్షి

భూతము లుగదా ? అంతేగాక చటోపాధ్యాయుడు వాక్శుద్ధి గలవాడని, అతనినోటివెంట శుభాశుభములలో నేది వచ్చి నను తప్పక జరిగితీరునని యాగ్రామవాసులును, ఆయన నెఱింగిన ప్రతివారును విశ్వసించియుండిరి.

భగవద్భక్తిప్రపూరితహృదయుడైన చటోపాధ్యాయుడు తనపుత్రునకు గదాధరుడని నామకరణ మొనర్చెను. గదా ధరుడు బాల్యమునుండియు దైవభక్తితత్పరుడై యుండువాడు. ఎచ్చటనైన రామాయణ భారత భాగవతాదిగ్రంథములు చదువునప్పు డచ్చటనే కూర్చుండి యాకథలను విని వానినే మననము చేయుచుండువాడట. ఎక్కడనైన హరికథలు, భజ నలు జరుగుచుండెనేని యాతావులకుబోయి యచ్చట పాడు కీర్తనలను, పద్యములను నాలకించి వానిని తనముద్దుపలుకులతో బాడుచు గంతులు వేయుచు భగవన్నామసంకీర్తనము చేయు వాడట. అతనికంఠస్వనము మిగుల మృదుమధురముగను, సున్నితముగను, తంబురాతీగవలెనుండి గానమునం దించుక ప్రవేశము గలిగియుండుటచే నేది పాడినను మిగుల శ్రావ్య ముగా నుండెడిదట. అంతేగాక మఱియొక దైవభక్తివిశిష్టయు సూత్రి మాతనికి బట్టువడెనట. ఏదేవాలయమున కేగినను ముందుగా నందలివిగ్రహములు బాగుగా చెక్కబడినవో లేదో యని చూచుచుండువాడట. రానురాను తద్విషయ మాబాలగోపాలమునకు విశదమయ్యెనట. అంత నెవరు దేవా లయములందు విగ్రహములను చెక్కింపవలసివచ్చినను ముం

డాతనిసలహాలను గైకొనుచుండువారట. మరియు దేవాలయములందు ప్రతిష్ఠింపబోవు విగ్రహములను బాలుడయినను నతనికిజూపి యాతనిమెప్పుపొందినపిమ్మటనే ప్రతిష్ఠ మొదలగునవి చేయువారట. ఇందుల కాగ్రామములోని పెద్దలును, పరిసరగ్రామములందలి భక్తులును వచ్చి యాతనివిగ్రహపరీక్షానైపుణికచ్చెరువందువారట.

గదాధరునకు బాల్యమునుండియు మంచిజ్ఞాపకశక్తి యలవడి దేనినైన నొక్కమారు చూచినను, ఒక్కమాఱు విన్నను మఱచిపోకుండుటయేగాక యెట్టిమాటలసందడిలో నున్నను చటాలున స్మృతికి దెచ్చుకొని చెప్పువాడట. ఒకప్పుడు భాగవతులు కొంద రాగ్రామమునకు వచ్చి జలక్రీడ లాడినారట. గదాధరు డచ్చోటికు బోయి రాత్రియంతయు మేలుకొని శ్రద్ధతో జూచి కథయంతయు జ్ఞప్తియం దుంచుకొని తరువాత కొలదికాలమునకు తోడిబాలురను కొందఱను జేరదీసి వారికంతయు జెప్పి జలక్రీడలు తాను నాయకుడుగానుండి యాడించెనట. ఇంకను నతనికి పసితనమునుండియు సాధువులన్నను, యోగులన్నను, సన్యాసులన్నను మిగుల సంతోషముగా నుండువాడట. అతడు వసించు కుగ్రామము సుప్రసిద్ధమైన జగన్నాథక్షేత్రమునకు బోవుమార్గమున నుండుటచే నామార్గమునబోవు సాధువులు, యోగులు, సన్యాసులును నాగ్రామమందున్న సత్రమున విశ్రాంతికై విడిసినప్పుడు వారికడకు బోయి తనయీడునకు మించిన ప్రశ్నలను వేయుచు వారి

వలన ననేకవిషయములు గ్రహించుచుండెడివాడట. ఆహా! ఆరేండ్ల బాలుడేమి? ఈవేదాంతప్రసక్తియేమి? ఇతడు ముందుముం దెంతయో మహాపురుషుడు కాగలడని యాసాధువులే యనుకొనువారట!

---

# ౨

## విద్యాభ్యాసము.

"హర్తకు గాదు గోచర మహర్నిశముం సుఖపుష్టిజేయు న
ర్థార్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థకోటికిం
పూర్తిగ నిచ్చినం బెరుగు పోదు యుగాంతరపువేళనైన భూ
.................................టొప్పగున్."

గదాధరునిజీవితము పిన్ననాటినుండియు నపూర్వమై యుండెను. తా నెట్టి ఘనకార్యములను నిర్వహించుటకై యీలోకమున జన్మించెనో యతడు బాల్యముననే గ్రహింపగలిగెను. గదాధరునకు జ్యేష్ఠసోదరు డొకడు రామకుమారభట్టోపాధ్యాయు డనునత డుండెను. అతడు సంస్కృతభాషనభ్యసించి మహాపండితుడై కలకత్తాలో నొకపాఠశాలను స్థాపించెను. గదాధరునకు తండ్రి పదవయేట నుపనయన మొన

ర్చెను. కొలదికాలములోనే తండ్రి మరణింపగా నతని చదువు సంధ్యల జాగ్రత జూచుభార మన్నపై బడెను. అన్న యాజ్ఞా ప్రకార మతడు పాఠశాలకు బోవుచుండెనే కాని యావిద్యాభ్యాస మతనికి రుచింపదయ్యెను. ఎంతసేపు వేదాంతవిచారణయందే యాతనిమనసు లగ్నమయ్యెను.

ఒకప్పు డొకయూరిజమీందారు మరణింప నాతని యుత్తరక్రియలసమయమున నాప్రాంతమందలి పండితబృంద మచ్చటికి చేరి యేవో వేదాంతవిషయములను చర్చించుచుండిరట. అప్పు డాపండితుల కేదో వేదాంతవిషయమున సందేహము కలిగి కొట్టుమిట్టాడుచుండ గదాధరు డచ్చటకుబోయి వారిసందేహమును దీర్పగా వారందరాశ్చర్యసాగరమున మునిగి విభ్రాంతులైరట. గదాధరుడు పాఠశాలలో గొంతకాలము చదివి యెంతకాలము చదివినను నీవిద్యలు పొట్ట నిండించుకొనుట కుపకరించువిద్యలేగాని మోక్షసాధనమగు విద్య కాదని విసువుజెంది పాఠశాలకు బోవ నిరాకరించెనట. అంతట రామకుమారభట్టోపాధ్యాయుడు తమ్ముని బిలిచి పాఠశాల కేల పోవుట మానితివని దండించి యడిగెనట. అందులకతడు 'అన్నా! ఈపాఠశాలలో జెప్పెడి చదువు పొట్టకూటికే యక్కరకు వచ్చును. అట్టివిద్య నాకేల? ఇందులకు బదులుగా నేను నిత్యానందదాయకము, శాశ్వతశ్రేయస్కరము, యోగిబృందకమున కతీతమునైన తత్వవిద్య నభ్య

సింప గోరుచున్నా' నని నదురు బెదురు లేక సమాధా మిచ్చెను.

గదాధరుడు తనతోడివా రందరును ధనకాంక్షచే విద్య నభ్యసించుచున్నారని, అర్థమే వారిపరమార్థమని యెఱింగెను. అంతటితో నే నీపొట్టకూటివిద్యల పొంతపోనని నిశ్చయించు కొనెను. పాఠశాలలందు జెప్పెడి నిర్జీవవిద్యావిధాన మతనికి రుచింపలేదు. ధనసంపాదనకు, కామతృప్తికి చదువుటన్న యాతనికి మనసొప్పలేదు. ప్రకృతిసౌందర్యరసము నాస్వా దింప గోరునతని మొలల లెక్కలు మున్నగు నీకృత్రిమవిద్యలం దాసక్తి నిలువలేకపోయినది. అతనియసమానబుద్ధివైభవము, అనన్యసామాన్యధారణాశక్తియు లౌకికవిద్యల నభ్యసింపని లోపములను దీర్చెను. అతడెంతసేపును పురాణశ్రవణము, శాస్త్రవ్యాఖ్యానములు, భారతీయవిజ్ఞానఖనులగు భారత రామాయణాదిగ్రంథసారమును గ్రోలుటయందే మనసు నిలి పెను. సత్యమరసి చూడ నాత్మజ్ఞాన మొసంగువిద్యకంటె నితరవిద్య లన్నియు నవిద్యలేకదా! అత డొంటరిగా గూర్చుండి విద్యావిషయకమగు నాలోచనలు సేయునప్పుడు 'ఔరా! సాలెపురుగే వేదము నభ్యసించినది? పామే శాస్త్రములను జూచినది? ఏను గెట్టిచదువు చదివినది? చెం చేమంత్ర మూహించెను? బోధావిర్భావనిదానములు చదువు లగునా? కావు. జంతుసంతతి కీశ్వరపదసేవాసక్తియే మహా త్తరవిద్య' అని యనుకొనువాడు.

వరికైనను దినము లోకరీతిగా జరుగవలెకదా ? గదాధరు డీరీతి నిరంతర మాత్మజ్ఞానపరిశోధనకే కాలమంతయు గడపుచుండ నతనిసోదరుడుకూడ మరణించెను. అందుచే కుటుంబభారమంతయు నాతనిపై బడెను. అందువలన నతడేదైనను పాయముచేగాని, వృత్తిచేగాని, కుటుంబమును, పోషించితీరవలెను. అక్కారణమున వేరుగతిలేక కలకత్తా కనతిదూరమున రాణి రాసమణి యనుజమీందారిణి యొకర్తుక గట్టించిన దక్షిణేశ్వరస్వామియాలయమున నర్చకుడుగా కుదిరెను. దానిప్రక్కనే కాళికాదేవియాలయముకూడ గలదు. గదాధరుడే కాళికాదేవి నర్చింపుచుండువాడు. ఆయాలయమును గట్టించినది శూద్రస్త్రీ. అందుచే నాలయప్రతిష్ఠ జరిగిన నాడు సుమారిరువదివేలమంది కన్నప్రదానము చేయబడినను తానచట భుజింపనొల్లక రాత్రివఱకుపవసించి కొంచెమటుకులు దిని కలకత్తాకు బోయెను. అతని వర్ణాశ్రమాచారధర్మపరత యట్టిది. ఆత డర్చకుడుగా నియమింపబడినను కాళికాదేవి నత్యంతభక్తితో నారాధించువాడు. పూజానంతరము దేవీవిగ్రహముకడ గూర్చుండి పుత్రుడు మాతృదేవతకడ గారాము చేసినట్లు "అమ్మా ! మాట్లాడవే ! నాగతి యేమి చెప్పితివే" యని మారాము చేయుచు నవిరళముగ ప్రార్థించువాడు. ఆదేవి తనతల్లియని, లోకమాతయని భావించుచు తాను నివేదించు నాహారము నామె సత్యముగా భక్షించుచున్నదని తలంచువాడు. అంతేగాక తనకు జన్మసాఫల్యము

గాలేదని తనహృదయపరితాపము నాదివ్యమాత కనేకవిధముల వెల్లడించువాడు. ఆలోకమాత సాక్షాత్కారము నందవలెనని యతని చిరకాలవాంఛ. ఆమెరూపముకంటె నన్యరూపము నాతడు చూడజాలడు. ఆజగజ్జననిప్రసంగముకంటె నన్యప్రసంగములను జేయుడు.

---

# 3

## వివాహము – విరాగము.

" ఉరుగతితోడ నేగు తడవుంచియు భోగము లట్టివాని దా
నరుడు పరిత్యజింపడు కనంగన తద్విరహంబు భిన్నమే
పురుషుని భోగముల్ విడచి భూరిమనోవ్యథ లాచరించు నా
పురుషుడె భోగముల్ విడిచి పొందు నిరామయ
శాంతిసౌఖ్యముల్. "

గదాధరుడు రేయింబవళ్ళు కాళికారాధనమునందే మగ్నుడయ్యెను. పగలు గతించి రాత్రి యగుటతోడనే మరింత దుఃఖించుచు, 'అమ్మా! మరొకరోజు గడచిపోయినది. నీవు నాయందు ప్రసన్నవు కాకపోతివి. నే నింకను పరమార్థమును కనుగొననైతిని' అని విలపించును. ఈవ్యథవలన నాతనికి ఆలయసేవ చేయుట కసాధ్యమయ్యెను. ఒకప్పు డాల

యమును విడచి యాప్రాంతమందున్న చిట్టడవిలోనికి బోయి యచట కొన్ని దినములు తపంబొనర్చుచుండెను. ఆసమయము మున సూర్యుని యుదయాస్తమయములే తెలియవయ్యెను. ఆకాంతారమున తా నెట్లు జీవింపగలైనో యాతనికి దెలియదు. శరీరమం దాతనికి స్పృహయే లేకపోయెను. అం దాతని కత్య ద్భుతదివ్యదర్శనములు గోచరింపసాగెను. ఆత్మరాహస్యములు వెల్లడి కానారంభించెను. స్వయముగా పరాత్పరుడే-ఆతడర్చిం చిన లోకైకమాతయే యతనికి గురువై తత్త్వోపదేశ మొన రించెను..

గదాధరుని యసమాన్యదైవప్రార్థనతత్త్వమును జూచి యతనికి మతిపోయినదని బంధుగులును, ఇంటిలోనివారును గూడ తలంచి యాపిచ్చి గుదుర్చుటకై వివాహము చేయ దలపెట్టిరి. అపు డాప్రసక్తివిని యతడు 'తనకు రామచంద్ర ముఖోపాధ్యాయుడనువిప్రవర్యుని కుమార్తె శారదామణి యను నుత్తమబాలిక భార్యయగునట్లు విధింపబడినదని, ఆయనకడ కరిగి యడుగుమనియు జెప్పెను. వారును వెంటనే రామ చంద్రముఖునికడ కరిగి పిల్లనిమ్మని యడుగ నేగిరి. ఆతడును తనకూతును గదాధరున కిచ్చి పెండ్లిచేయ నంగీకరించి యట్లే వివాహ మొనర్చెను. వివాహానంతర మతడు మరల వచ్చి యాలయమున నర్చకుడుగా నుండెను.

వివాహము పూర్తియైనదికాని బంధువులనుకొన్న ట్లాత నికి పిచ్చికుదర లేదు. పైగా యధికమయ్యెను. ఈమా అతడు

కేవలము ప్రార్థనముమాత్రమే నేయక యహోరాత్రము లొక్క పెట్టున నెడతెరపి లేకుండ, తల్లీ! నాకు బ్రత్యక్షము కావే మని రోదింపసాగెను. కొంద ఱతని కేదో దారుణరోగబాధ సంప్రాప్త మైనదనిరి. గదాధరు డర్చకుడుగానున్న దేవాలయ ధర్మవర్తినియగు రాసమణి కల్లుడైన మధురనాథుడును నది వ్యాధియే యనినిశ్చయించి తగుచికిత్స జేయించుటకై ఘన వైద్యులను రావించి చూపెను. ఆవైద్యు లేరును నతనిరోగ మిట్టిదని రూఢిపఱచ లేకపోయిరి. అం దొకమహావైద్యు డిది రోగమే కాదనియు, నితడు మహాయోగియనియు, ఆతని సమాధినిష్ఠ జూచి వీరు వ్యాధి యనుకొనుచున్నారనియు జెప్పి వైచెను. ఒక్కొక్కప్పుడు గదాధరుడు భక్తిచే పరవశీకృతతనుడై కాళికి సమర్పింపదలచిన కుసుమమాలికలను తన కంఠముననే ధరించును. మధురనాథు డది చూచి గదాధరు నిపై నాగ్రహావరవశు డయ్యెనేకాని తుద కాతనిమహిమ నెఱింగి యుపేక్షించెను. ఇది యంతయు గాంచిన మధుర నాథు డితనివలన నింక దేవి కర్చనాదివిధులు సాగనేరవని గదా ధరునిదగ్గరబంధువు నొకని నర్చకుడుగా నియమించెను.

మధురనాథుడు తన్ను పనిలోనుంచి తప్పించుట కాత డెంతయు సంతోషించి యింకను భక్తితో దేవి నర్చించుటకు సావకాశము కలిగినదికదాయని తదేకదీక్షతో నిరంతరము కాళినే సేవించుచుండెను. ఇట్లుండ నెంతకాలమునకు దేవి

తనకు ప్రత్యక్షము కానందులకు వగచి నిరాశపడి మృతినొంద నెంచి శరీరమున స్మృతి లేకుండ వివశుడై పడిపోయెను.

మొదట నీదృశ్యమును గాంచిన కొందఱు మూర్ఛా రోగగ్రస్తు డయ్యెనని తలంచిరిగాని పరిశీలించిచూడ నది సమాధి యయ్యెను. ఆసమాధిలోనే కాళీమాత యతనికి ప్రత్యక్షమై యనుగ్రహించెను. అప్పు డొకించుక మనశ్శాంతి కలిగెను. నాటనుండి గదాధరుడు జీవితాంతమువఱకు నెన్ని మాఱులో సమాధిమగ్ను డగుచునే యుండెను. ఆసమయ మున గొప్పవైద్యు లెట్టివారు వచ్చి నాడి పరిశీలించినను కాన బడునదే కాదు. ఈవింత కెవ్వరును హేతువును గనజాలరైరి. గదాధరుడు సమాధియం దున్నపుడు కాళీమాత తనకు ప్రసన్న యగుచుండెనా, లేక నేను చిత్తభ్రామికుడ నైతినా యని శంక నొందుచు ప్రత్యక్షముగా నందలి సత్యమును గనుంగొనుట కెప్పుడును జరుగని యొకసంఘటన తారసిల్లినచో దేవిప్రత్యక్ష మగుట విశ్వసింతునని యాతడు కాళీమాతతో ననుచుండును. అంతేగాక యావిషయమున తనసన్ని వేశమును గూడ దేవితో నిట్లు విన్నవించెను.

తల్లీ! అసూర్యంపశ్యలగు నంతఃపురమానినులగు రాణిరాసమణితనయ లిరువురును నంతఃపురము వీడి నీయాలయ ప్రాంగణమునీనున్న వటవృక్షముక్రిందకు వచ్చి నాతో వలు కాడిన నీవు నాకు ప్రత్యక్షమైనటుల నమ్మెదను. అనుచుండు

వాడు. ఆయుంగన లిరువురు నింతవఱ కెప్పుడును నంతఃపురము విడిచి బయటకు వచ్చినవారు కారు. ఈదేవ్యాలయ మెట నున్నదో చూచినవారు కారు. ఆదేవ్యాలయముగడపకూడ త్రొక్కి యెఱుంగరు. అదేమి యాశ్చర్యముతోగాని యొకనా డాశుద్ధాంతవనిత లిరువురును నాలయమునుజూడ తల్లియాజ్ఞ బడసి యాలయమునకు వచ్చి వటవృక్షచ్ఛాయనున్న గదాధరుని పలుకరించి, 'అన్నా! దేవి, నీయెడ ప్రసన్నురా లగును. భీతినందకుము' అని వచించి మరలి యింటి కేగిరి. ఇట్టివిచిత్రసంఘటన లెన్నో దేవియనుగ్రహమువలన జరుగు చుండెడివి.

ఈరీతిగా నిరంతరసమాధినిష్ఠతో గదాధరుడు పన్నెం డేండ్లు తపం బొనర్చెను. ఆసమయమం దతని కొక్కరేయి గూడ కూరుకు లేదు. బలవంతముగా నేత్రములు మూయ దలచినను మూయబడలేదు. ఒక్కొక్కమా రాతడు, మాతా! నాకు మరణ మాసన్నమయ్యెనా యని భీతిలుచుండ, వత్సా! నీవు దేహాభిమానశూన్యుడవుకాదేని మోక్షార్హుడ వెట్లగుదు వను శబ్దము కర్ణపేయ మగుచుండెడిది. మరొకప్పు డతడు, జననీ! నేను అకించిజ్ఞులగు మానవులకడ విద్య నేర్వకాలను. నీవే నేర్పుమని యడుగువాడు. అప్పు డతనికి, బిడ్డా! నేనే నీకు చదువు చెప్పుదునులే యనుమాటలు వినవచ్చెడివి. మఱి యొకప్పు డతనిబుద్ధి సర్వసమానత్వముపై నిలచి, మాతా!

నేను బ్రాహ్మణుడుగా జన్మించితిని గాన గొప్పవాడను. మిగిలినజాతులవా రందఱు నీచులు. అనుదురభిమానము నాచిత్తము నకు గలుగకుండ ననుగ్రహింపుమని దేవిని ప్రార్థించును. వెంటనే యహంకారభావమును పెకలించుటకై మిగులతక్కువ జాతిజనులతో సమానుడుగా నుండవలెనని నిశ్చయించుకొని, బిచ్చగాండ్రు, చండాలురు మొదలగు నల్పజాతులవారు భుజించిన ప్రదేశములను పరిశుభ్ర మొనర్చుచు వారియెంగిలిని యజ్ఞశేషముగా దలంచును. అంతేగాక నపరిశుద్ధపదార్థము లను దొలగించు సేవకకృత్యములందుగూడ వారితో సముడు గావలెనని మలినప్రదేశములను తనశిరోజములతోడనే సమ్మార్జన మొనర్ప నిశీథములందు రహస్యముగ నీవలకు వచ్చువాడు. ఈదృశంబులగు ననేకతీవ్రతమసాధనములచే గదాధరుడు తొల్లి దేవదానవులు సముద్రమును మథించినట్లు తన మనశ్శరీరములను మథించినందుననే యాతని కమృతత్వము వశీకృతమైనది.

మఱియు గదాధరుడు బాల్యమునుండియు కామ్యము లను నసహ్యించుకొను దివ్యమూర్తి. జగంబున కద్వితీయా దర్శమూర్తి. ప్రపంచమున కామకాంచనమును విడచిన యోగులుకూడ నత్యల్పముగనే యుందురు. అట్టివారిలో గదాధరు నగ్రగణ్యుడని చెప్పుటమాట యటుంచి యతడు కేవలము కామకాంచనముల పూర్ణత్యాగరూపుడనియే వచింప

దగును. బంగారమును, మృత్తికను సమముగ నెంచు త్యాగ మూర్తి. ధనమును జూచిన నతనితనువు గడగడ వణకును. హృదయము బెదరును. అంతేగాక నత డొకప్పుడొక చేతితో మంటిముద్దను, రెండవచేతితో బంగారమును బట్టుకొని యా రెంటి ననేకమాఱులు చూచిచూచి, బంగారమును మట్టి యనియు, మట్టియే బంగారమనియు నభేదభావముచే రెంటిని గంగలో విసరువాడు. మరొకప్పుడు రూపాయిల నొకచేతి తోను, చిల్లపెంకుల నొకచేతితోను గ్రహించి, గంగాతీరమున గూర్చుండి, ఒకచేతివైపు చూచి, ఇవి రూపాయలు. వీనితో పొట్టనింపుకొను వస్తువుల నన్నిటిని గొనవచ్చును. వీని నంద ఱును గౌరవింతురు. రెండవచేతివైపు చూచి, ఇవి చిల్ల పెంకులు. వీనిమొగ మెవరును జూడరు. నా కివి రెండును సమానములేయని గంగలోనికి విసరును.

కొందఱవివేకు లతనిని యిదంతయు డంబాచారమని యాక్షేపించువారు. అట్టివారిలో రాసమణియల్లుడును ధన వంతుడునగు మధురనాథు డొకడు. ఆత డిట్లయిన గదాధరుని ధనాశాపూరితు డనుపించుట కొకనా డతనికి పదునైదువందల రూప్యముల వెలగల గొప్పశాలువను దెచ్చి కప్పెను. ప్రథమ మున గదాధరుడు కొంచెముసంతోష మభినయించి రెండు నిమిషములైనపిమ్మట నాశాలువనుదీసి మట్టిలో బడవైచి కాలితోరాచి, దానిపై నిష్ఠీవనంబు వేసి, ఇది గర్వమును

పెంపొందించును. ఇంతకంటె ప్రాతగుడ్డపీలిక లుత్తమములని నేలనూడ్చి గిరగిరద్రిప్పి పెంటకుప్పలపై విసరెను. మధుర నాథుడు విభ్రమాశ్చర్యచకితుడై సిగ్గుతో దలవంచుకొని పోయెను.

ఈతరుణమునకు గదాధరుని ధర్మపత్నియగు శారదా దేవి దినదినప్రవర్ధమానయై యప్పటికటికుపుట్టినింటనేయుండెను. కాని తన్ను వివాహమాడినసంగతికూడ పతి మఱచియే యుండునని, అతడున్మాదుడయ్యెనని బంధుగులు చెప్పు చిత్త బాధాకరంబులగు పలుకులను విని యేమైనను సతికి పతితోడిదే లోకమని భావించి జననీజనకులయాజ్ఞ బడసి పతిదేవుని దర్శింప వచ్చెను. అంత గదాధరుడు, ఆమె తనధర్మపత్ని యని యెఱింగియు పాదములపై వ్రాలి, తల్లీ! నేను స్త్రీలనందఱను మాతృభావముననెగాని యన్యభావముతో జూడనేఱను. నేను నీదాసుడ ననిపల్కెను. అపు డామె పరమపావని యగుట నాథునితత్వమును గ్రహించి, స్వామీ! నేను మిమ్ములను సంసారనరకకూపమున ద్రోయవచ్చినదానను గాను. మీకు బరిచర్య లొనర్చుచు శిష్యురాలనై యుండెదను. నాకోరిక చెల్లింపుడని ప్రార్థించెను. ఆమెకోరికను పతి మన్నించుటయు నాటినుండి సహధర్మచారిణియగు నామె యాతనిప్రియశిష్య కోటిలో నగ్రస్థానమును బొంది తనపతియే జగత్పతి యని నమ్మి యర్చింపమొదలిడెను.

మధురనాథు డొకనాడు శారదాదేవి సన్నిధికివచ్చి, అమ్మా! నీవుకూడ విరాగిణివై కాలక్షేప మొనరించుట మంచిదికాదు. నేను నీకు బదివేలరూప్యంబుల నొసంగెదను. వానింగొనిపోయి నీవు సుఖముగా బుట్టినింట నుండి సర్వసౌఖ్యముల ననుభవింపుమని బోధించెను. అంత నామె, తండ్రీ! నాయెడ నిట్టిదయ చూపినందులకు నీకుకృతజ్ఞురాలను. కాని నాపతిదేవుడు కాంచనజయమును బొందియే మహానుభావుడయ్యెను. నేనును నాపతియడుగుజాడలనే యనుసరించి పోయెడిదానగాని యన్యమార్గ మొల్లనని నిరాకరించెను.

---



## తత్వసిద్ధి-శిష్యపరంపర.

"ఒంటి దిరుగుచు గోర్కె లుజ్జగించి
శాంతి జేకొని పాణిభాజనుడనై ది
గంబరుడనై సమస్తకర్మంబు లెపుడు
మొదలు చెడ ద్రుంతు బరమేశ సదయహృదయ!"

గదాధరుడు ప్రాపంచికవిషయములం దన్నిటియందును త్యాగబుద్ధి నలవఱచుకొన్నవాడని పదేపదే చెప్పనక్కఱలేదు

కదా ! అత డగ్నిసాక్షిగ వివాహమాడిన భార్య నవనవోన్మేష యౌవనవిలసితరూపమాధుర్యముతో తన్ను దర్శింప రాగా ' అమ్మా ' యని సంబోధించి జగన్మాతృస్వరూపముగ నెంచెను గదా ! అట్టిమహాత్ముడు ప్రతికాంతను మాతృభావముతో జూడగల్గెనని వచించుట చర్విత చర్వణమే యగును. నాటినుండి ఆమహాత్ముని యాధ్యాత్మికవిజ్ఞానసంపత్తిని బురస్కరించుకొని గదాధరనామమును దీసివైసి గురుజనులు శ్రీరామకృష్ణుడని పేర్కొనిరి. ఇంతటినుండి మేముకూడ శ్రీరామకృష్ణనామము తోనే ప్రస్తావింతుము.

శ్రీరామకృష్ణుడు వివిధములైన యాధ్యాత్మికసాధనములందు నిమగ్నుడై యుండిన సమయమున నొకనాటిశుభ ప్రదీప్తవేళ నామహాత్మునికడ కొకయోగినీమణి వచ్చెను. ఆమెపవిత్రనామము భైరవీబ్రాహ్మణి. కాని వాసస్థల మెద్దియో యెవ్వరు నెఱుంగరైతిరి. ఆమెకు సకలపురాణములును కర తలామలకములుగ, కంఠపాఠముగ వచ్చును. మరియు నెటు వంటి కొమ్ములు తిరిగిన పండితప్రకాండులనయిన నవలీల వాద ప్రతివాదము లొనర్చి విజయపతాక నందగల ప్రజ్ఞాన్వితే. ఎప్పుడో యొకప్పుడు కాళీమాత రామకృష్ణునకు, ఒకవనితా మణి వచ్చి నీకు గొంతవఱకు తత్త్వవిజ్ఞానము నేర్పగలదని వచించెనట. ఆరీతిగనే స్ఫురద్రూపిణియు, విదుషీమణియు, దృఢగాత్రియు, దీర్ఘశరీరిణియుగల తద్యోగిని రామకృష్ణు

నన్వేషించుచు వచ్చి యతని నానవాలుపట్టి, నాయనా! నేను నీకొఱకే వెదకుకొనుచు వచ్చితిని. కనబడితివా? యని పలుకరించెను. మరియు నాతనితో గలిసి కొంతికాల మచ్చటనే యుండెను.

శ్రీరామకృష్ణునకు సమాధిమగ్నుడై నప్పటినుండియు నప్పుడప్పుడు శరీరమంతయు మంటలుపుట్టి బాధనందింపజేసెడివి. అప్పుడు వెంటనే గంగలో కంఠదఘ్నముగ నుండి చాల సేపటివరకు నిలబడువాడు. ఇట్లుండ నొకదినమున యథాప్రకారముగ శరీరమంతయు భగభగమని మంటలు బయలుదేరెను. అప్పుడు తనచెంతనున్న భైరవీబ్రాహ్మణిని ప్రశ్నింపగా నామె నిజమైన భగవద్భక్తు లందఱకు శరీరములో మంటలెత్తుననియు, తొల్లింటికాలమున ననగా నాలుగువందలయేండ్ల క్రిందట శ్రీచైతన్యునకును, అంతకంటె ముందుకాలమున రాధాదేవికిని భగవంతునియందుగల యనురాగముచే శరీరతాపము సంభవించెననియు జెప్పెను. మఱియు నామె తనవాక్కులను ఋజువుపరుపకపోయిన రామకృష్ణు డంగీకరింపకపోవచ్చునను నభిప్రాయముతో వైష్ణవపురాణముల నన్నిటిని దెప్పించి యందు ప్రమాణములను జూపి ఋజువుచేసెను.

అంతేకాక నయ్యోగినీమణి రామకృష్ణుని శరీరమునకు చల్లనిమంచిగంధమును బూయించి, మెడనిండ పుష్పమాలికలను వేయించి యీరీతిగనే శ్రీచైతన్యునియొక్కయు, రాధా

దేవియొక్కయు తాపము చల్లారెనని వచించెను. ఇవ్విధము లగు శైత్యోపచారములచే రామకృష్ణునిమే నద్భుతముగ చల్లబడెను. ఈమంట లడగిపోయినతర్వాత క్షుద్బాధ యత్యధిక మయ్యెను. ఎంత యన్న మెన్ని పదార్థములతో నెన్ని పర్యాయములు భుజించినను నాతనికి క్షుత్తు తీరదయ్యె. అప్పుడాయోగినీమణి చైతన్యస్వామికిని, రాధాదేవికినిగూడ నిట్లే విపరీతమైన క్షుద్బాధ కలిగెనని వచించి యందుల కెన్నియో గ్రంధములను దెప్పించి సోదాహరణముగ బోధించెను. అంతతో నుపేక్షింపక యామె షడ్రసోపేతములైన వంటకములను, పిండివంటలను, వివిధశాకములను, అనేక భక్ష్య భోజ్య చోష్య లేహ్య పానీయాది పదార్థములను, అన్నపురాసులను దెప్పించి కుప్పతెప్పలుగా నతనియెదుట బెట్టించెను. ఆపదార్థపురాసులను జూచుటచే నతనికి కొంతకాలమునకు క్షుత్తు తీరి మామూలుప్రకృతిలో బడెను. ఈమహాయోగినియే శ్రీరామకృష్ణునకు సమస్తతాంత్రికరహస్యములను వెల్లడించుటయేగాక పండితప్రకాండులసమక్షమున శ్రీరామకృష్ణుడు భగవదవతారమూర్తియని, శాస్త్రప్రమాణపరంపరతో నిరూపించి ముముక్షుజనులకు మహోపకారము గావించెను.

ఈతీరుగా నతడు యోగశాస్త్రమున ననిర్వచనీయ ప్రతిభాసంపన్నతతో బరిపూర్ణపాండిత్యప్రకర్ష నార్జించి, దానికి వన్నె దెచ్చు వేదాంతశాస్త్రము నభ్యసింపవలయునని యువ్విళు

లూరుచుండెను. మహాత్ముల సంకల్పములు తలంచినమాత్రాన యీడేరునని ఋజువుపరచుటకో యన నొక శుభదినమున శ్రీరామకృష్ణునికడ కొకదివ్యప్రభావ సంపన్నుడును, తత్వశాస్త్ర మామూలాగ్రముగ నమృతబిందువులతో శిష్యకోటి యాస్యబింబముల కందింప శక్తివంతుడును, మహాపురుషుడును నగు దిగంబరయోగి యొకండు వచ్చెను. అతడు గ్రీష్మనిదాఘవాసరాతపములనైనను, కొండచిల్లులువడు వడువున వర్షపాతమగు సమయములందును, తరువులక్రిందనేగాని కుటీరములందు తలదాచుకొనడు. నిరంతరము గ్రామబహిఃప్రదేశములనేగాని యూరిలో నుండనొల్లడు. పండ్లు పాలెగాని యన్నాదికములను ముట్టడు. అతనితపశ్శక్తియు, జ్ఞానశక్తియు, ఆధ్యాత్మికప్రతిభయు, మేధాసంపత్తియు నెట్టిదో కదా!

శ్రీరామకృష్ణు డొకదినమున గంగానదీతీరమున నుపవిష్టుడై యుండ నా దిగంబరయోగి వచ్చి రామకృష్ణుడవు నీవే యనుకొందునని గురుతించెను. పిదప నీకు బ్రహ్మజ్ఞానోపదేశ మొనరింపవచ్చితినని వచించి నాటినుండి పదునొకండు నెలలాతనితో గలిసియుండి దివ్యోపదేశ మొనర్చి సమస్తవేదాంతసారామృతమగు నిర్వికల్ప సమాధిని కరతలామలకముగ నొనర్చెను. రామకృష్ణుడును దన యనన్యసామాన్యదుర్లభమగు శేముషీమహిమచే నా యోగిపుంగవు డుపదేశించిన బ్రహ్మవిద్య నత్యల్పకాలములో నవలీలగా గ్రహింపగల్గెను. తోతా

పురి యను ప్రసిద్ధనామమున నొప్పు నయ్యతీంద్రుండు రామ కృష్ణుని మేధావిభవాతిశయంబున కమందానందము నత్యంతా శ్చర్యము నొంది, వత్సా! నీవు బుద్ధివిశేషమున బృహస్పతి కదు. నేను నలుబదిసంవత్సరములు పలువిధములైన శ్రమల కోర్చి యార్జించిన విద్యావిభవమును నీవు నాలుగుదినములలో నేర్చితివని శ్లాఘించి నాటినుండి శిష్యునిగా భావింపక మిత్రు నిగా భావించుచుండెను.

ఆ యోగిపుంగవుడు సర్వదా తనకడ నగ్నిహోత్రమును నిలుపుకొని దానినే పరమపవిత్రముగ నెంచుచుండెను. అట్టి స్థితిలో నాయగ్నిహోత్రమున నెవడో యొక డొకదినమున ధూమపానాసక్తతతో చుట్ట కాల్చుకొని పోయెను. అంత యోగి తనయగ్ని మైలపడినదని వానిపై నాగ్రహాపరవశు డగు చుండెను. అప్పుడు రామకృష్ణుడు, అయ్యా! ఈయగ్నియు, దీనిని మైలపరచిన యామానవుడును పరబ్రహ్మస్వరూపము లే గదా? మీ కేల యిట్టి భేదభావము కలుగవలెనని తీవ్రస్వర ముతో మందలించెను. అపు డాయోగి రామకృష్ణునితో ఇంతటినుండి నే నెవరిపైనను కోపము నొందబోనని పలికి తెలివి తెచ్చుకొనెను. చూచితిరా! రామకృష్ణుని సత్యసంధత, సర్వ సమత్వసాహసములును.

శ్రీరామకృష్ణుడు పైవిధముగా తత్వజ్ఞానసముపార్జ నముచేసి జాన మొకదారి నడత యొకదారి గాకుండ నద్వైత

సిద్ధి నందెను. పిమ్మట యోగాభ్యాసము చేయుగడంగి ముందు కొన్ని దినములు ప్రాణాయామమునుబట్టి శ్వాసను బంధించి యాహారమును విసర్జించి గడపువాడు. ఆ రోజులలో నెట నుండియో యోగిపుంగవు డొకడు వచ్చి రామకృష్ణునితో గలిసియుండువాడు. ఆసాధుసత్తముడు రామకృష్ణుడు ప్రాణాయామము బట్టినసమయములం దాహారము గైకొనకుండుటచే నతనికి ప్రాణాపాయము సంభవించునేమోయని భీతి నందు వాడు. ఆసాధు వట్లు తలంచి యుపేక్షింపక బలవంతముగ నాహారమును గ్రింగించుటకుకూడ యత్నించుచుండువాడు. ఒకనాడు రామకృష్ణు డెంతప్రబోధించినను మేలుకొనకపోవుటచే నాసాధువు చేదుడ్డుతో నతనిని మోది మెలకువ గలుగునట్లు చేసి యెట్లో రెండు కబళములయన్నమును నోటగ్రుక్కి తెప్పి రిల్ల జేయువాడు.

ఇవ్విధంబున యోగాభ్యాసవిధాన మారుమాసములు సాగునప్పటికి రామకృష్ణునకు భోజననిద్రాసుఖములు లేక పోవుటచే గ్రహణిరోగము ప్రాప్తించెను. ఈరోగము యోగమును మాన్పించి యతని కెంతో యుపకృతి యొనర్చెను. అపుడు స్వదేశవైద్యులు రామకృష్ణుని జబ్బు కొలది దినములలో మాన్పిరి! అంత నత డీయోగాభ్యాసవశంబున సామాన్య యోగులకు బొందశక్యముగాని నిర్వికల్పకసమాధిని తాను ప్రవేశింపగలిగితిననియు, దృఢమనశ్శరీరముల గలవాడనగుట

చేత నట్టిసమాధినుండి మరల బయటపడి బ్రతికితినిగాని సామాన్యయోగులు పునర్జీవనమందుట కష్టతరమే యని తరువాత కొంతకాలమున కనుచుండెడివాడు. ఆరోగ్యమును బడసినపిమ్మట రామకృష్ణుడు వైష్ణవభక్తిమార్గముల నవలంభింపవలయునని సంకల్పించెను.

అయితే భగవంతుని వైష్ణవులు, ఐదువిధములుగా భక్తితో సేవించు టాచారమైనది. సేవకులు యజమానుని భయభక్తివినయవిధేయతలతో సేవించినట్లును, స్నేహితులొకరిపై నొకరవ్యాజానురాగముతోనుండి పరస్పరము ప్రేమించుచున్నట్లును, తాము కడుపారగన్న బిడ్డలను జననీజనకు లపారవాత్సల్యముతో ప్రేమించినట్లును, భార్య తనకు జీవితసమాప్తిపర్యంత మాధారభూతుడుగనున్న భర్తను ప్రేమించి వలచినట్లును, తమ్ముగన్న జననీజనకులకు నతిగారాబుతో పోషించి రక్షించి ప్రేమించినట్లును, నితోధికముగ సేవింతురు. ఇందు నైదవదియగు భార్యాభర్తృప్రేమానుపద్ధతియే గొప్పదనియు, నామార్గమునే తొల్లింటికాలమున గోపికలు, రాధాదేవియు ననుసరించి ముక్తులైరనియు, నమ్మి శ్రీరామకృష్ణు కొన్నిదినములు ఆడువేషమునుదాల్చి తాను భగవంతునిభార్యయగు రాధనని తలంచుకొనుచు తత్సంయోగమునకై భగవంతుని చాలపర్యాయములు ప్రార్థించెను.

ఒక దినమున రామకృష్ణునకు గోపాలకృష్ణదేవుఁడు చిరునవ్వు మొగంబున చిందులాడుచు, వేణువు నూదుచు, కాళ్ళ గజ్జెలు గల్లుగల్లున మ్రోయుచుండ సాక్షాత్కరించెయినంతట ధన్యుఁడ నైతినని, జన్మ తరించెనని, కృతార్థుఁడ నైతినని భావించెనట. రామకృష్ణుఁడు రాధ పరమభాగవతోత్తము రాలనియు, నామె గోపాలకృష్ణునందు నపూర్వమైన వలపు నిలుపుటకు కారణము భక్తితత్పరతయేగాని, కేవలరతిక్రీడాసక్తయై కాదనియు నావిషయము జ్ఞానవంతులేగాని పామరు లెఱుంగజాలరనియు నట్టిపామరులు రాధామాధవుల ప్రేమపుంజమును వ్యక్తీకరించు గ్రంథములను జదువుట కనర్హులనియు వాదించుచుండువాఁడు.

ఒకప్పుడు వివేకానందుఁడను నామమున జగద్విఖ్యాతి గాంచిన నరేంద్రుఁడు రామకృష్ణుని పూర్తిగా విశ్వసింపని సమయమున నాగురుశిష్యుల సంవాదములో రాధాకృష్ణలీల యొక సమస్యగా బరిణమించెను. ఆ వాదనలో నరేంద్రుఁడు రాధ కల్పితవ్యక్తియనియు, నిజముగా నొకవేళ యథార్థవ్యక్తియైనను నామెకు కృష్ణునితోడి సంబంధము నింద్యమని నొక్కి చెప్పువాఁడు. ఈవిషయమున నీయూహ పొరపాటని రామకృష్ణుఁ డెంతచెప్పినను విననందున నతఁ డపుడు, నాయనా! నీయూహ ప్రకారము రాధ కల్పితవ్యక్తియని, ఏతదుపాఖ్యానము నే భక్తుఁడో సృష్టించినాడని మాటవరుస కొప్పుకొంటి మనుకొం

దము. అపుడు రాధ కృష్ణపరమాత్మనుగూర్చి పడిన పరితాప మును, గోపికలపరితాపమును గూర్చి యేమిచెప్పవలెను. దాని నివేల గుర్తింపవు. కేవలబాహ్యావర్తనమునే బట్టుకొని ప్రాకు లాడెదవేల? ఇదియంతయు నీ కీక్షణమున మానవచరిత్రగా, గోచరింపవచ్చునుగాని మున్ముందైనా గోపికల పరితాపసాక్షా త్కారములను దివ్యములని యంగీకరించి తీరెదవునుమా యని ప్రాకృుచ్చెను.

ఆ పుణ్యాత్ముని పలుకుబడివిధముగనే వివేకానందస్వామి కొంతకాలమునకు తనభక్తియోగోపన్యాసములందు గురు దేవుని యుపదేశ తత్వమును గూర్చి ముచ్చటింపుచు నందు బృందావనగోపికలు శ్రీకృష్ణభగవాను నేవిధముగ ప్రేమిం చిరో, యక్లే యాధన్యురాం డ్రాతని వేణుగానము నాలించినంత సమస్తమును మరచి, సంసారమును, సంసారయాతనాబంధము లను, సుఖదుఃఖములను, సమస్తవిధులను, సకలకార్యకలాప మును విస్మరించి, శ్రీకృష్ణుని సంయోగమునకై యిలు వీడి పరుగెత్తిరో తద్విషయమును వర్ణింప మానవమాత్రునికి సాధ్యము కాదు. అని ప్రబోధించెను.

ఈవిధముగా భక్తియోగమునందు సంపూర్ణసిద్ధినొందిన రామకృష్ణు డొకపరి ప్రపంచమంతను సింహావలోకనము చేసి భగవంతునిసాక్షాత్కారమునకు సనాతనధర్మసంప్రదాయములే గాక యాధునిక సర్వమతసంప్రదాయము లభ్యసింపవలసినవే

యని నిశ్చయించి, కొంతకాలము మహమ్మదీయపద్ధతి ననుస రించి భగవంతుని ధ్యానించెను. మరికొంతకాలము క్రైస్తవ మతసాంప్రదాయముగ భగవంతుని ధ్యానించెను. ఒకమా రట్లు సమాధినుండి యేసుక్రీస్తును ధ్యానింపుచుండ నా యేసు ప్రభు వతనికి బ్రత్యక్షమయ్యెనట. రామకృష్ణు డేమతపద్ధతి ననుసరించి ఏదేవు నేకాలమునందు ధ్యానించునప్పు డాదేవుడు సాక్షాత్కరించి యామతరహస్యముల నన్నిటి నాతని కెరింగిం చెడివాడట. సర్వమతముల నవలంబించుటచే ప్రతిమతము మంచిదేయనియు నేమత మవలంబించినను మానవులకు ముక్తి లభించుననియు, నొక్కొక్కమత మఖండసచ్చిదానందుడగు భగవానుని గుణగణంబులను తేటతెల్ల మొనర్చునని యాత డెఱుంగగల్గెను. అక్కారణమున సర్వమత సామరస్యమున బ్రహ్మానందతేజోరూపములు ననేకరీతుల ప్రకాశవంతమై రామ కృష్ణునందు రూపొందె నని వచింపవలయును.

శ్రీరామకృష్ణుడు సంకల్పసిద్ధుడని ఖ్యాతి నందెను. దానికి తార్కాణగా నొకదినమున నాయన గంగానదితటంబున గూర్చుండి తనకు యోగాభ్యాస మొనరించుకొనుటకు తగిన రీతిగా నొకపర్ణశాల నిర్మించుకొన దలచి యాలోచింపుచుం డెను. అంతలో నాయనగూర్చున్న తావున కెదురుగ నద్భుత మగునట్లుగా గొన్ని వెదుళ్లు, తాటియాకులు, దూలములు మొదలగు కుటీరనిర్మాణానుకూలమైన పరికరము లన్నియు

సాక్షాత్కరించెను. వెంటనే తత్పరికరముల నన్నిటిని గ్రహించి కొందరశిష్యుల సహాయమున నతడు కుటీరమును నిర్మించుకొనియెను.

పిదప గొన్ని దినంబుల కాయన కాళీమాతయాలయమున నర్చకుడుగా నున్నప్పటినుండియు నెరింగియుండిన రాసమణిరాణియల్లుడైన మధురనాథుడు తీర్థయాత్రలకేగుచు రామకృష్ణుని తనవెంటబెట్టుకొని గొంపోయి మితిలేనన్ని యాత్రలు సలిపి తుదకు కాశీక్షేత్రమునకు జేరెను. రామకృష్ణుడు వారణాసిలో జగత్ప్రసిద్ధమైన యోగిపుంగవుడగు త్రైలింగస్వామిని దర్శించి యాయనవలన గొన్ని తత్వరహస్యములు నెరింగెను మరియు నటనుండి గోకులబృందావనమున కేగి గంగామాతయను పూజ్యురాలిని కొంతకాలము సేవించి కృతార్థుడయ్యెను.

అటనుండి వారు మరలి కలకత్తాకు వచ్చుచుండగా మార్గమధ్యమున నపరిమితదరిద్రబాధచే క్రుంగుచు విలవిలలాడుచున్న పల్లెలోని జనులను గాంచి, వారి దైన్యమునకు వగచి వారియాకలిదప్పుల నడంచిననేగాని నే నిందుండి యొక్కయడుగైన ముందునకు రాజాలనని పట్టుపట్టెను. అపుడు మధురనాథుడా గ్రామవాసులకు చాలధనము వ్యయించి కొన్నినాళ్ళు అన్నప్రదానమును, వస్త్రదానమును గూడ నొనర్చి వారినాదరించెను. రామకృష్ణునకు దీనదయాళుత్వమే గాక సదాచార సంపన్నిపుణతలోగూడ ప్రజ్ఞ యుండెను.

ఏవిషయమునగాని యాతడు వ్యవాహితమనస్కుఁడునని కూడ వచింపరాదు. ఆయనసన్నిధానమున నెందరో సమాధిగతులైరి. దుర్మార్గులు కొంతమంది యీయనను సేవించి కల్మషదూరులై పోయెడువారు. ఆయననొకమారు దర్శించిన జారులకు కాంతలందాసక్తియు, లోభులకు ధనాసక్తియుగూడ నంతరించెడివట.

రామకృష్ణుడు కాంచనజయ మందినవారిలో నగ్రగణ్యుడని చెప్పియుంటిమిగదా! అంతే గాక చరమకాలమునందాతడు కనకరజితముల నింతదనుక యేహ్యముగ చూచినట్లే యినుమునుగూడ ముట్టుటకు సంశయించెడివాడట. ఆయనవద్ద నింకను నెన్నియో మహిమములు గలవని భక్తులు కనిపెట్టిరి. అయితే వానిని బహిరంగపరచి తాను ప్రజ్ఞావంతుడ ననిపించుకొనుట కాయన యిష్టపడెడువాడు కాడని యాభక్తులే వ్యక్తపరచిరి. ఇంకొకవిశేష మేమనగా నాగతానాగతములను వచించుటలో నాయన ప్రజ్ఞ యపారమని, వాక్సిద్ధి యప్రతివంతమైనదని వాడుక. తనయెదుట జరుగబోవునవి గాక తన పరోక్షమున జరుగనున్నవి, జరిగినవి చెప్పుటలోను, తనయెదుట నున్న వారి మనసునందలి భావములను రచించుటలోను నందెవేసిన చేయి.

మరియు నిరంతరము రామకృష్ణుడొక యద్భుత విషయమును బహిరంగపరచువాడు. ప్రపంచములో గొందరు మనుజులు దేవాంశములను వెలిబుచ్చు గుణగణంబులతోను,

మఱికొందరు మనుజులు రాక్షసాంశములను ప్రకటించు గుణగణములతోను పుట్టుదురనియు; నట్టివారిని చాల సులభముగా కనిపెట్ట వచ్చుననియు చెప్పెడివాడు. అంతేగాక తొల్లిటి జన్మంబున చక్రవర్తులై యఖిలభోగభాగ్యపరంపరను తృప్తిదీర ననుభవించినవా రీపుట్టువునందు విరాగులై, సర్వసంగత్యాగులైన మహాయోగులుగను, సన్యాసులుగను, సాధుపుంగవులుగను జన్మించి తీరుదురని వాక్రుచ్చువాడట. ఇవ్విధంబులగు నద్భుతమహిమంబు లనేకములు గలిగియున్న సుకృతాత్ముడు కలకత్తామహానగరసమీపముననున్నను నానగరవాసులు చాల కాలమువరకు నాయనను గాని, ఆయన మహిమలనుగాని గుర్తింపకపోయిరి.

ఆకాలమునకు కలకత్తానగరమున బ్రహ్మసమాజమత వాసనలు నలుదిశలకు వ్యాపించియున్నవి. వృద్ధులలోను, ప్రసిద్ధులలోను పేరెన్నికగన్నవా రెందరో యీ మతమునకు జేయూతనిచ్చుచు నామతమును విస్తరింపజేయ ప్రచారము నొనర్చుచు నామతమును సర్వజనవ్యాప్త మొనరింప బద్ధకంకణులై యుండిరి. అట్టివారిలో కేశవచంద్రసేనుడను నొక మహాత్ముడు తాను బ్రహ్మసమాజమతాచార్యుడై నిరంతర మామతప్రదీప్తికై పాటుపడుచుండువా డుండెను. అతడు భాగవతోత్తముడై విరాగియై యొకతోటలో వసించుచు కాలమును గడపుచుండెను. శ్రీరామకృష్ణుడు బ్రాహ్మమతప్రచార

తీవ్రతను, కేశవచంద్రసేనుని ప్రచారదీక్షను విని యొకప్పు డాయనతో సంభాషింప నాతోటలోని కరిగి తనరాకను తెలుపుడు చేసెను.

కేశవచంద్రసేను డింతదనుక రామకృష్ణునితో ముఖాముఖిగ ప్రసంగింపక పోయినను నాయనసంగతి కర్ణాకర్ణిగ బహుముఖంబులనుండి వినియుండెను. అందుచే రామకృష్ణు నెదుర్కొని స్వాగతమిచ్చి హృదయపూర్వకమైన యనురాగగౌరవములతో తన విడిదికి గొంపోయెను. వారిరువురును గొంత కాలము మతచర్చలను జరిపిరి. అయ్యిరువురకు మతవిషయమునం దభిప్రాయభేదములున్నను మనసులు హత్తుకొనిపోయి విశ్వసనీయమైన పరమమైత్రి యేర్పడినది. దానిమూలమున వారు తరచుగా కలియుచు నెవరికి వారే స్వమతావేశపూరితులై, స్వమతోద్దిష్టనిర్ణయవ్రతులై వాదనలను సల్పుచుండెడివారు. తుట్టతుదకు కేశవచంద్రసేనుడు కొంతకాలమునకు శ్రీరామకృష్ణుని ప్రభావమును గుర్తించి, యతని నాశ్రయించి పలువిధములైన మతవిషయికసంశయముల నడిగి తెలిసికొని యాయనయందు పరమభక్తిచే నాయనపాదములు తనకన్నుల కద్దుకొని పలుమా రాయనను దర్శించి బ్రహ్మజ్ఞాననిష్ఠాపరవశుడై యాతనిసిద్ధాంతములనే యవలంబించి ధన్యుడయ్యెనని వచింతురు.

ఈ కేశవచంద్రసేనుడీ రామకృష్ణునిబోధనల 'నొక్కచో గూర్చియు, నాయన మహామహిమాన్వితమైన చిత్రచరిత్రను గూర్చియు నొకయుద్గ్రంథమును వ్రాసి బహువ్యయప్రయాసములతో వెలువరించెనట. ఆ గ్రంథము బయటకు వచ్చినది మొదలు కలకత్తానగరవాసులైన జనులనేకు లాయనను గుర్తించుటయేగాక నాడు మొదలు కలకత్తానుండియు, బంగాళా దేశమంతటిలోనుండియు వందలాదిగా జనులు వచ్చి తమసంశయములను దీర్చుకొనుచు బోవుచుండిరట. అట్టిసమయములందప్పుడప్పుడు రామకృష్ణున కీశ్వరావేశము గలుగుచుండెడిదట. ఆ యావేశము లేనప్పుడు తనకడకు వచ్చినవారికేగాక సేవకులకుగూడ విధేయవర్తనుడుగనుండు నామహానుభావుడా యావేశము వచ్చినతోడనే తాను భగవంతుడనని, తనవంటివారు లేరని తొల్లింటికాలమున తానే రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, యేసుక్రీస్తు మొదలయినవారుగ పుట్టినదియని వచించువాడట. ఆయనబోధనలను విని యందరను సంతృప్తి నందుటయేగాక నతనియెదుటనుండి పోవుటకు నిష్టపడువారు కారట.

ఈసమయమునకు కలకత్తాలో సనాతనవిద్యాప్రభావమును వెల్లడించువారు లేకపోలేదు. అట్టివారిలో మహర్షి దేవేంద్రనాథటాగూరు, సురేంద్రనాథమిత్రుడు మున్నగువారు ముఖ్యులు. వారికి శ్రీరామకృష్ణుని మతసన్నివేశప్రతిభ తెలిసియేయున్నది. వారు పలువిధంబులుగ పలువురివలన పలువిషయంబులను వినుచు నుండెడివారట. అట్టి మహనీయులవలన

రామకృష్ణుని మతప్రతిభ కొలదికాలములోనే మిగుల బాహు ళ్యముగ విస్తరిల్లినది. అంతేగాక శ్రీరామకృష్ణుని జీవితమును దివ్యకుసుమమాలికయందు భక్తిజ్ఞానకర్మలు మున్నగుయోగ ములును, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతము, మున్నగు మతభావ ములును కుసుమరాజములై విలసిల్లగానే యందలి దివ్యసౌర భము దేశమంతయు నావరింప శ్రీరామకృష్ణునివాగమృతమును గ్రోల ముముక్షుజనసందోహ మెక్కువగా నాయనను దర్శింప వచ్చెడిది.

అట్టివారిలో గౌరీపండితుడు, పద్మలోచనుడు, కేశవ చంద్రసేనుడు, వైష్ణవచరణుడు, శశధరతర్కచూడామణి, ప్రతాపచంద్రముజుందారుడు, విజయకృష్ణగోస్వామి, నాగ మహాశయుడు మొదలగువా రాయనయమృతా స్వాదన భాగ్యము నెక్కువుగా బడసినవారు. అంతేగాక మరియొక విశేషమనగా నాయనకడకు మతసంపన్నతావేశముతో వచ్చు వారిలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పండి తులు, కవీశ్వరులు, తత్త్వవేత్తలు, స్త్రీలు, పురుషులు నను భేదములేక యనేకవిధములుగా నున్న వ్యక్తులు వచ్చువారు. అయితే వచ్చినవారెల్ల రాయనబోధనలు శిరసావహించి యట్లు సంచరించెడివారు. చాలమంది యాయనతోడిదే లోకమని యాయనకు శుశ్రూషలు గావింపుచు నాయనకు శిష్యులై, యాయన మతమునుబోధించుప్రవక్తలై జీవితశేషమునుగడపిరి.

ఆశిష్యపరంపరలో నాయనబోధనలను జగంబున ప్రచారించి మించినవారిలో నెల్ల నగ్రగణ్యుడు శ్రీవివేకానంద స్వామి. ఆయనఅడుగుజాడలలో నడచిన శిష్యులు శ్రీబ్రహ్మానంద, శారదానంద, యోగానంద, నిరంజనానంద, అద్వైతానంద, రామకృష్ణానంద, త్రిగుణాతీతానంద, ప్రేమానంద, అద్భుతానంద, తురీయానంద, సుబోధానంద, శివానంద, అఖండానంద, అభేదానందస్వాములును, గిరీశచంద్రఘోషు మహేంద్రనాథగుప్త, శ్రీనాగమహాశయుడు, శ్రీమతిఅఘోరమణీదేవి, యోగినీమాయి, గోలప్‌మాయి, గౌరీమాయి మున్నగువారు ముఖ్యులుగ నెంచబడిరి.

అప్పటికి సుమారు యిరువదిరెండు సంవత్సరముల వయసుగలిగి యాధునికవిద్యలందేగాక ప్రాచీనవిద్యలందుగూడ విజ్ఞానమును సంపాదించి తత్వశాస్త్రపరిశోధనలను జరుపుచు భగవంతుని ప్రత్యక్షముగ, జూచినవారెవ్వరైనగలరా యని మేము మతాభిమానులము, మతప్రచారకుల మన్నవారినెల్ల దర్శించి ప్రశ్నించి పరితాపమందుచున్నాడు. అప్పటికి వంగదేశమున విపులముగా వ్యాపించిన బ్రహ్మమతమునందు ప్రవేశించెనుగాని యది మనశ్శాంతిని గలిగింపలేకపోయెను. అప్పటి వంగదేశీయులలో నుత్తముడును పలువురచే గురుజనుడుగ భావింపబడువాడునగు మహర్షి దేవేంద్రనాథఠాకూ రుత్తమ దేశికుడని విని నరేంద్రు డాయనను దర్శించెను. కాని నరేంద్రు

డేగువర కాయన ధ్యాననిమగ్నుడుగా నుండెను. నరేంద్రుని జూచినంతనే యాతని తేజఃప్రభావమునకు నిశ్చేష్టితుడయియుండగా భగవత్సందర్శనైకవాంఛచే బరితపించు నరేంద్రుడు తన్ను మహర్షి బలుకరింపకుండగనే "తాము దేవుని జూచితిరా?" యని ప్రశ్నించి సరియైన సమాధానమును బడయనేరక నిరాశతో వెనుదిరిగిపోయెను.

నరేంద్రుడు భగవత్సందర్శనమునకై పడు పరితాపమునకు మేరయే లేకపోయెను. చతుర్వేదములును, ఆరుశాస్త్రములును మున్నగు సకలవిద్యలును భగవంతుని సాక్షాత్కారము జేయింపనివైనచో వ్యర్థములే గదా యనుభావము లాతని హృదయసీమను దోపసాగెను. భగవంతుడున్నాడని చెప్పినంతమాత్రమున నతనిమనస్సు తృప్తినందుట లేదు. ప్రత్యక్షముగా భగవంతుని తాను జూడవలయుననియే యాతని పరమ సంకల్పము. ఈసంకల్పసిద్ధి కానిచో నాతనికి మనశ్శాంతి లేదు. కాని నిరంతరము భగవంతు డెచట నుండును? ఎట్లు నేను చూడగలను? నాకు జూపగలవా డెవడు? అనియే పరితపించుచుండును. ఈపరితాపమును దీర్చుకొనుటకే దేవేంద్రనాథుని దర్శించి హతాశు డయ్యెను. పిదప నెందరనో మతాచార్యులను జూచెను. కాని యందేయొక్కడును భగవంతుని జూచితిమనిగాని, చూపగలమనిగాని చెప్పినవారు లేకపోయిరి. ఇంకేమి చేయవలయునా యని యాలోచనమగ్ను డయ్యెను.

ఇంతలో నొకదినమున శ్రీరామకృష్ణును మహాభక్తుడైన సురేంద్రనాథమిత్రునిగృహామునకు విచ్చేసెను. ఆదినముననే నరేంద్రుడు భగవత్సంకీర్తన మొనర్ప సురేంద్రునిగృహామునకు బోవుట తటస్థించెను. నరేంద్రు డానాడు మహోత్సాహామున జేసిన సంకీర్తన కేచటనుండి చూచుచున్న శ్రీరామకృష్ణు డానందపరవశు డయ్యెను. సంకీర్తనానంతరము సురేంద్రునివలన నరేంద్రునిస్థితిగతులు మొదలగువానినిగూర్చి తెలిసికొని దక్షిణేశ్వరమునకు రావలసినదిగా నాహ్వానించెను. నరేంద్రుడు రామకృష్ణుని దర్శించి తనహృదయపరితాపము నడంచుకొన దలంచెనుగాని యింతదనుక తాను బోయిన మతాచార్య ప్రముఖులవంటివాడేగద యీాయనయు ననినిరుత్సాహాతతో నుండెను.

అట్టిసమయమున నరేంద్రునిదగ్గఱబంధువగు రామదత్తుని కడ నీప్రస్తావన రాగా నతడు నరేంద్రునితో నీకు పరమార్థమే కావలయునేని బ్రహ్మసమాజాదికముల కేలపోవుట ? శ్రీరామకృష్ణపరమహంస యనుమహాత్ముడు దక్షిణేశ్వరముననున్నాడు. పోయి యామహానుభావుని గలియుమని చెప్పెను. తోడనే యొకనిమిష మైన నాలసింపక నరేంద్రుడు పయనమై దక్షిణేశ్వరమున కేగి శ్రీరామకృష్ణపాదారవిందములకడ వ్రాలెను. నరేంద్రుని జూడగనే రామకృష్ణుడు చంద్రోదయమునకుప్పొంగు సంద్రమువలె నరేంద్రుని మహోత్సాహామున నాదరించెను. అయ్యాదరణలో రామకృష్ణుడు నరేంద్రుని గూర్చుండ నియో

గించి ముందు సంకీర్తన మొనరింపగోరెను. పిదప నత డకస్మా త్తుగా లేచి నరేంద్రునిహస్తమును గ్రహించి యేకాంతప్రదేశము నకు గొంపోయెను. తన కేదో యుపదేశ మొసర్చునని నరేంద్రుడు భావించి యుండగా రామకృష్ణు డానందపార వశ్యతచే నేత్రములనుండి బాష్పకణములు రాలుచుండ, ఎంత కాలమునకు వచ్చితివి నాయనా యనెను.

అనంతరము రామకృష్ణుడు, తండ్రీ! నీకొఱ కెంత కాలమునుండియో వేచియుంటిని. ప్రపంచజనుల నీచప్రసంగ శ్రవణమున నా చెవులు చిల్లులు పడినవి. ఈనాటికి నాయాత్మా నుభవములను జీర్ణించుకొనజాలిన రసజ్ఞుడు లభించెను. ఇప్పుడా ప్రసక్తి నీయెదుట గావించి నాతరితాపమును బాపు కొందునని వచించెను. ఆమరుక్షణముననె చేతులు జోడించు కొని నరేంద్రుని కభిముఖముగ నిలచి నీవు సనాతనమునీంద్రుడ వగు నరుడవని, మనుజసంతతిబాధలను మాన్పుటకై యవత రించిన నారాయణుడవని నే నెఱింగితి ననుచు నరేంద్రుని యెదుట గొన్ని మధురపదార్థములనుంచి తినుటకు బలవంత పఱచి ఫలహారానంతరము తిరిగి శీఘ్రకాలములో రావలయును సుమా యని హెచ్చరించి నరేంద్రుని వీడ్కొలిపెను.

పిమ్మట నరేంద్రుడు వెలుపలికి రాగానే రామకృష్ణుడు తనసన్నిధానమున నున్న భక్తజనులతో చూచితిరా! నరేంద్రుని ముఖమండలమున సరస్వతీతేజఃపుంజ మెట్లు దేదీప్యమానముగ

మెఱయుచున్నదో? నేను నిద్రింపబోవుచున్నపుడు నీ కేమైన జ్యోతి యగపడునా యని ప్రశ్నింప నత డౌనని సమాధాన మిచ్చెను. తోడనే యతడు ధ్యానసిద్ధుడని పుట్టుకతోడనే ధ్యానపరిపక్వత నొందిన సిద్ధుడని పలుక నచ్చటనున్నవారంద ఱును సమ్మోహితులైరి.

కాని నరేంద్రునకుమాత్రము రామకృష్ణుని చేతలును, చేష్టలును నత డొకమహాపురుషుడా? లేక ఉన్మాదుడా యను సంశయమును గలిగించెను. అంత నరేంద్రుడు నే నాతనిని సావకాశముగ దిలకించితిని. ఆయనమాటలందుగాని నడవడి యందుగాని వైరుధ్య మించుకంతయు లేదు. రామకృష్ణుని పారమార్థికప్రసంగములవలన నతనిని విరాగిగనే నరేంద్రుడు తలంచెను. అట్టితలంపుతోనే తాము భగవంతుని చూచితిరా? యని ప్రశ్నించెను. రామకృష్ణుడు భగవంతుని చూచితిననియు నిన్ను జూచుచున్నట్లే భగవంతుని జూచుచున్నానని భగవంతుని సాక్షాత్కార మొందుట సులభమని, నీతో నేను మాట లాడుచున్నట్లే భగవంతునితో గూడ మాటలాడవచ్చునని, భగవత్సాక్షాత్కారమునకై పరితపించువారు లేరని, పిల్లల కొఱకో, భాగ్యముకొఱకో దురపిల్లువారేగాని లేరని, అట్లు దురపిల్లిన దేవుడు సాక్షాత్కరించి తీరునని వచించెను. దేవుని జూచితివని చెప్పువారింతవఱకు నరేంద్రునకు గానిపింపలేదు. కాని యీయాతడు చెప్పుమాటలకును, నరేంద్రు నాదరించుపట్టున

చేయువింతచర్యలకును సామరస్యము కనపడనందున నరేంద్రుడు రామకృష్ణుని నున్మాదునిగా దలంచెను.

నరేంద్రుడు రామకృష్ణు డున్మాదుడా యని శంకింపు చున్నను నతనిసన్నిధానమున నున్నపుడు తా నేదియో యప్రమేయసుఖము నందినట్లుమాత్రము నమ్మియుండెను. అంతేగాక నరేంద్రు డొకకీర్తన పాడినంతనే రామకృష్ణుడు బ్రహ్మానంద పరవశుడగుటయు, శరీరస్మృతిని త్యజించుటయు, పునస్మృతి నందుటయు, అతనియనన్యసామాన్యపవిత్రజీవనపద్ధతి, మృదులాతిమృదులములగు నాతనిసంభాషణలు, దేవునిభాతిగ శిష్యకోటి యతనిని పూజించువిధానమును జూచి నరేంద్రుడు దిగ్భ్రాంతి జెందెను. రామకృష్ణునందు తనకెంత మహోన్నత గౌరవము కలిగినను నరేంద్రు డాతని వెంటనే గురువుగ నంగీకరింప నొప్పలేదు.

ఒకనెలదినములు గడచినపిమ్మట నరేంద్రుడు మఱల శ్రీరామకృష్ణుని దర్శింప బోయెను. అతనిని జూచినంతనే రామకృష్ణుడు పరిపూర్ణానందచిత్తుడై నరేంద్రుని తనశయ్యపై నత్యంతప్రేమతో గూర్చుండజేసి తనహృదయమున నేదో యుచ్ఛరించుచు నరేంద్రుని సమీపించెను. తొల్లిటివలెనే యేదో విచిత్రచర్య గావించునని నరేంద్రు డనుకొనుచుండగా రామకృష్ణుడు తనదక్షిణపాదము నాతనిదేహముపై నుంచెను. తోడనే నరేంద్రున కొకయపూర్వానుభవంబు కలిగి కన్నులు

తెఱచియుండగనే యామందిరము వస్తువులన్నింటితోఁగూడ గిఱ్ఱున దిరుగుచున్నట్లు గన్పట్టి మఱుక్షణములో నదృశ్యమై తనతోఁపాటు చరాచరప్రపంచమంతయు మహాశూన్యమై లయ మగు చున్నటుల దోఁచెను. తాను మృత్యుముఖమున బడు చుంటినని నరేంద్రు డూహించి, నాకింటతలిదండ్రులున్నారు. నన్నేమి చేయుచున్నారని వివశుడై గర్జించెను. రామకృష్ణు డపు డించుక పెద్దగా నవ్వి నరేంద్రునిగుండె నిమురుచు నిప్పటి కిది చాలును. అంతయు సకాలమున ప్రాప్తించును. అనిన తత్క్షణమే యామందిరమంతయు మామూలుగా గనపట్టెను. కాని నరేంద్రుడుమాత్ర మిది నిజమా! యింద్రజాలమా యనిమాత్ర మనుకొనెను.

నరేంద్రుడు మరల కొలదికాలమునకే రామకృష్ణుని దర్శించెను. అపుడు రామకృష్ణు డతనిని సమీపపుష్పవనము నకు దోడ్కొనిపోయి యందు గొంతసేపు విహరించి తనమంది రమునకు తిరిగి వచ్చి సమాధినిమగ్నుడై నరేంద్రుని తాకెను. తోడనే నరేంద్రునకు శ్రీరామకృష్ణు నద్భుతప్రభావంబనెడి సూర్యరశ్మిచే నరేంద్రునినిశ్చయమనెడి హిమము కరిగిపోయి బాహ్యస్మృతిశూన్యత సంభవించెను. పదినిమిషములకు బిమ్మట నరేంద్రుడు స్మృతివచ్చి కన్నులు తెరచువఱకు రామకృష్ణు డతనిగుండెపై చేయివైచి మెల్లగా నిమురుచుండెను.

ఆసమయమున శ్రీరామకృష్ణుడు నరేంద్రునిగూర్చి యనేకాద్భుతవిషయములను గనుగొనగల్గెను. నరేంద్రు నత డెన్నియో ప్రశ్నల నడిగెను. అందు ముఖ్యముగా నరేంద్రుని పూర్వజన్మవృత్తాంతము, ప్రపంచమున నతనిమహోద్యమము, ఆయుఃప్రమాణములు. వాని కన్నిటికి నరేంద్రుడు తలవంచి యదుత్తరముల నిచ్చెను. రామకృష్ణుడు నరేంద్రునిగూర్చి యెట్టిభావావేశముల నందెనో యవి యిప్పుడు బలపడినవి. అందువలన నరేంద్రుడు ధ్యానసిద్ధుడని, ఆత్మద్రష్టయగు మహర్షియని, ఆత్మరూపమును గుర్తించినవెంటనే యోగ మార్గమున శరీరమును త్యజించునని గ్రహించెను.

శ్రీరామకృష్ణుని పాదస్పర్శవలన కలిగిన యపూర్వానుభవము నరేంద్రుని మనోభావ మాయనయెడ మార్పొందెను. అందువలన నాయన పిచ్చివాడు కాడని యహంకారమమకారపాశబద్ధులై, కామకాంచనాసక్తులై సంసారసాగరమున ప్రమత్తహృదయులై సంచరించు మానవకోటిలో రామకృష్ణుడొక్కడే సుస్థిరమతియని, ధైర్యవంతుడని గ్రహింపగల్గెను. కాని యంతమాత్రముచే విన్నన్న చెప్పినదే వేదమనురీతిగ నమ్మ దలచుకొనలేదు. ఏవిషయమునుగాని నరేంద్రుడు మహాపురుషు డెవడో చెప్పినంతమాత్రమును, ఏదో యొకగొప్పగ్రంథమున వ్రాయబడినంతమాత్రమునను విశ్వసించుప్రకృతి నరేంద్రునిది

కాదు. అతడు సత్యాన్వేషణబద్ధకంకణుడై యనేకమానసిక బాధల నందినయైన తనపరిశోధనలు నవిమగ్నముగా ఫలించినపుడే యతడు దేనినైన విశ్వసించునేగాని మఱియొకరీతిగా నమ్మడు.

---

# ౫

## గురుశిష్య విద్యానుభవములు.

"బలిసదనంబు జొచ్చెదవు ప్రాకెద వభ్రపదంబు దాటి యు
గ్వలయము సంక్రమించెదవు వారక చిత్తమ చాపలంబునన్
దలప వొకప్పుడున్ మఱచి తప్పియు లోన వెలుంగు బ్రహ్మ
మున్
దలచెదవేని పొందెదవు నాశవివర్జితనిత్యసౌఖ్యమున్."

శ్రీరామకృష్ణుని పదసన్నిధానమున నరేంద్రుని జీవిత మపూర్వదివ్యభావములతోను, అద్వితీయాదర్శములతోను, అఖండాత్మానుభూతితోను, విరాజిల్లిన పారమార్థికజీవనప్రవంచమని చెప్పనగును. వారియన్యోన్యప్రేమభావము లనూనములును, అనుపమానములును నైయున్నవి. వారిరువు రొకే దేహమున స్థిరపడియుండు మనఃప్రాణములని, జీవాత్మలని భావించినను పొరపాటు కానేరదు. ఏపుణ్యక్షణమున నరేం

ద్రుడు రామకృష్ణుని దర్శించి దేవుని మీారు జూచితిరా యని ప్రశ్నించెనో, యాక్షణముననే నరేంద్రుని పారమార్థిక జీవనకల్ప తరువు కుసుమితము కానారంభించినది. రామకృష్ణు నాధ్యా త్మికశక్తి నరేంద్రునందు జొచ్చి యాతనిని వివేకానందుని గావించి గురుసందేశామృతమును ప్రాచ్యప్రతీచీఖండవాసుల కందజేసినది.

సాధారణముగా భగవంతుని సాక్షాత్కారము నందిన పుణ్యాత్ములగు గురుజనులు యట్టిపారమార్థికసంపద నెన్నడును తా మేకాకిగ ననుభవింప నంగీకరింపక తగినవారి కద్దానిని పంచియిచ్చుట కువ్విళులూరుచునే యుందురు. శ్రీరామ కృష్ణుడు వివేకానందు నాదినుండియు ప్రేమించి యాదరించుట కిదియే నిదానము. రామకృష్ణుడు వివేకానందుడు కొన్నిదిన ములు తనకు గాన్పింపడేని యతనిని జూడ తహతహపడి కాళీ మాతను జేరి వివేకానందుని జూడకుండ నుండజాల నతనిని తొందరగా రప్పింపుమని ప్రార్థించువాడు. ఆదేవియనుగ్రహము చేత గాబోలు మరుక్షణముననే వివేకానందుడు గురునిముాల ప్రత్యక్ష మయ్యెడివాడు.

శ్రీరామకృష్ణుని మృదులంబగు లేతయెడందయు, భగ వద్భక్తిపారవశ్యతయు వివేకానందుని ముగ్ధుని గావించినట్లే వివేకానందుని యచంచలమగు నాత్మవిశ్వాసము, భగవద్దర్శ నైకవాంఛాతత్పరతయు రామకృష్ణుని ప్రేమపాశబద్ధునిగా

జేసెను. ఒకప్పుడు వివేకానందుడు తనయందు రామకృష్ణుడు చూపుప్రేమను మోహముగా నూహించి, నన్నేల మీరు నిరంతరము తలచి నాకై పరితపింతురు? తొల్లి జడభరతుడు తాను పెంచిన మృగశాబకమును గూర్చి మోహితుడై యా ధ్యానముతోనే యసువులను వీడి పునర్జన్మమున మృగశాబక మైనట్లే మీరు నేనే యగుదురేమో యని విమర్శించెను. తోడనే రామకృష్ణుడు కాళికాలయమున కేగి పదినిమిషము లలో చిఱునవ్వు మొగమున చిందులాడుచుండ తిరిగి వచ్చి, నరేన్! నాతల్లి నీలో నేను నారాయణుని జూచియే ప్రేమించు చున్నానని చెప్పినది. దీని కభ్యంతరము గలిగినచో నీమొగము జూచుటయే దుర్భరమగుననియు వచించిన దనగా వివేకా నందుడు సిగ్గుజెందెను.

అప్పరమపూజ్యుడైన గురుప్రవరుడు వివేకానందుని సమక్షమున నతనిపారమార్థికప్రతిభను శిష్యబృందముకడ నుగ్గడించుచు, నరేంద్రుడు వేదవిహితమైన హోమఖగము వంటివాడు. ఆపక్షి మహోన్నతస్థానమున వసించినట్లే యిత డును మోక్షసౌధంబును జేరును. నాకడకువచ్చు మోక్షేచ్ఛు లలో నత డగ్రగణ్యుడు. నిత్యసిద్ధుడు. ఆజన్మబ్రహ్మజ్ఞాని. ఇట్టివారు ఈశ్వరకోటిలోను ఆచార్యకోటిలోను గణింపబడి జగద్గురుత్వభారము వహించి లోకకళ్యాణ మొనర్ప జన్మింతురు. నాశిష్యులలో కేశవచంద్రసేను డొకమంచిలక్షముచే ప్రతిభా

నంపన్నుడైన నరేంద్రుఁ డట్టిలక్షణములు పదునెనిమిదింటితో విరాజిల్లుచుండెను. కేశవచంద్రసేన విజయకృష్ణులు జ్ఞానదీప్తులై యుండ నరేంద్రుఁడు కేవలము ప్రచండసూర్యబింబమై యున్నాఁడని పొగడెను. నరేంద్రుఁ డాపొగడ్తలను సహింపక యెవ్వరైన విన్న మిమ్ము పిచ్చివాడని యందురనియు, అఖండయశోవిశాలురైన కేశవచంద్రసేనవిజయకృష్ణులతో నల్పుఁడగు నాకు సామ్యమా ? యనగా రామకృష్ణుఁడు 'ఇవి తల్లి పలుకులుగాని నామాటలు గావని, ఆమె నా కెప్పుడు నసత్యము చెప్ప' దని నెమ్మదిగా ననును.

రామకృష్ణుఁడు నరేంద్రుని ప్రత్యేకభావముతో దిలకించుచు గురుశుశ్రూష నొనర్చునవు డతఁ డేదైన చేయ నున్నపుడు ప్రత్యక్ష శివస్వరూపుఁడైన యితఁడు నాకు సేవచేయుట ధర్మము కాదని వారించువాఁడు. అంతేగాక యతని నెవరైన నిరసించిరేని వారిపై మండిపడును. మఱియు నొకవ్యఁ డెవ్వరో నరేంద్రుఁడు చెడుసావాసమున చెడిపోవుచున్నాఁడని యనినంతనే యావేశపూరితహృదయముతో, అసత్యమనియు, నరేంద్రుఁడు దుర్వృత్తులకు వశుఁడగుట కల్లయనియు నట్టి యధికప్రసంగిమొగము నేను చూడఁబోననియు వాక్రుచ్చెను. ఇంకను తనశిష్యవర్గములో దక్కినవారి కాహారవిహారాదులందు నియమము లున్నను నరేంద్రునివిషయమున నట్టి నిర్బంధము తాను చేయకుండుటయు నతఁడే చేసుకొన్న వలదని

వారించుటయు మతలోకవిశేషము. ఒకప్పుడు నరేంద్రుడు, నేను నిషిద్ధాహారమును భుజించితిని. ప్రాయశ్చిత్తమేమని యడిగెను. దానికి రామకృష్ణుడు "దానివలన నీకు లేశమైన దోషము లేదనియు, గోమాంసభక్షణము చేసినవాడుగూడ చిత్తమును భగవదాయత్త మొనర్చిన నది హవిష్యాన్నముతో తుల్య" మనియు వక్కాణించెను.

ఇంక నరేంద్రుడు బ్రహ్మసమాజమున కభిమానియై యుండుకాలమున సోదరశిష్యు డొకడు కాళికాదేవికి నమస్కరించుట చూచి, విగ్రహారాధనను నిరసించువాడగుట నిదేమి తెలివితక్కువయని యతనిని మందలించెను. ఆవిషయమున గురుశిష్యు లిరువురకు వాదన జరిగెను. ఈసంగతిని రామకృష్ణు డాలించి, నాయనా! ప్రతిమనుజుడు నాదిలోనే నిర్గుణారాధకుడు కాలేడనియు, సగుణారాధకుల చిత్తములను క్షోభింపజేయకు మనియు వచింపగా నరేంద్రు డావిషయమై పలువిధములుగా తర్కింప నించుకవినుగుతో, నాదివ్యమాత నంగీకరింపనేని నీ విట కేలవచ్చితి వనెను. అపుడు నరేంద్రుడు ధైర్యముతో నే నిటకు వచ్చినంతమాత్రమున నామనమునకు తృప్తిలేని యీకాళీమాతసిద్ధాంతమును నేనంగీకరింపవలయునా యని ప్రతిఘటింప, రామకృష్ణుడు, నీవెప్పటికైన నాలోకమాతను స్మరించి విలపించు రోజులు వచ్చితీరునని పలికెను. ఆగురుదేవునిమాటలు సత్యములై నరేంద్రుడు వివేకానందుడై విగ్రహారాధనమును సమర్థించినాడు.

ఏవిధముగా నైన నరేంద్రున కద్వైతవేదాంతరహస్యములనుపదేశించి తనయుపదేశముల నాతనిప్రజ్ఞామూలమున ప్రపంచమంతటను ప్రాకింపజేయవలయుననియే రామకృష్ణుని హృదయమందలి ముఖ్యాశయము. కొంతకాలము నరేంద్రుని హృదయసీమను బ్రాహ్మసమాజవాసనలు బలవత్తరములుగా నుండుటచే జీవబ్రహ్మైక్యసిద్ధాంతముల నవగతము జేసికొనలేకపోయెను. అందుచే విపరీతాద్వైతవాదనలు సలుపుచు సమస్తము బ్రహ్మస్వరూపమే నాయని నిరసించుచుండ రామకృష్ణు డతనిని డగ్గఱి చిరునవ్వుతో నేమిటిపాయనాయని యతనిని తాకుచు సమాధిమగ్నుడయ్యెను. అంతతో నరేంద్రుని చిత్తము చరాచరరూపమగు నీప్రపంచమంతయు బ్రహ్మస్వరూపముగానే యున్నదని గ్రహించెను. అంతటినుండి భుజించుటకు గూరుచున్నపుడు తినుబండారములు, భోజనపాత్ర వడ్డించెడి తల్లి తినెడితాను బ్రహ్మమై గోచరింపగా నిశ్చేష్టుడగువాడు. అపుడు తల్లి భుజింపుతండ్రీ! ఊరకుంటివేల యన నదేపనిగ దినుచుండెడివాడు. ఆతనిమనఃపరివర్తనము ప్రపంచ మొకస్వప్నమాయానుభావమును తోపింపచేసెను. ఇట్లు కొంతకాలము గడుచువఱకు నరేంద్రు డద్వైతసిద్ధాంతమును తనమనఃఫలకమున జిత్రించుకొనెను. అంత నాసిద్ధాంతమతనికి బ్రత్యక్షగోచర మగుటయు రామకృష్ణునియందలి భక్తితాత్పర్యములు వేయిరేట్లుగ నభివృద్ధినందెను.

శ్రీరామకృష్ణుడు శిష్యుడుగా నెవ్వరినిగాని పూర్తిగా పరీక్షించనిదే గ్రహింపలేదు. ఎన్నో కఠినపరీక్షల ధాటికాగనిదే నరేంద్రుడు డత్తిశిష్యత్వమును బడయలేదు. ఒకప్పుడు గురుదేవుడు నరేంద్రుని దేహమును బరిశీలించి, నాయనా! నీదేహ లక్షణములు మంచివేకాని నిద్రవేళలందు నీ యూపిరి యించుక భారముగా నుండును. ఇది దీర్ఘాయుర్దాయమునకు లక్షణము గాదని మహాయోగు లందురు. నీకన్నులు నీయందిమిడియున్న భక్తిజ్ఞానసమ్మేళనమును బయలుపఱచుచున్నవనెను. మరొకప్పు డతని నతికఠినముగా బరీక్షించెను. నరేంద్రు డెప్పుడు వచ్చినను మహదానందముతో నాదరించు గురుదేవు డొకనా డాతనిరాక గమనించియు తెలియనట్లే యుపేక్షించెను. మరొకమారు నరేంద్రుని జూచి పెడమొగము బెట్టుకొనెను. ఈరీతి ననేక మారు లనేకవిధములుగా జేసినను నరేంద్రునకు రామకృష్ణుని యందు భక్తితాత్పర్యములు సడలక గురుదేవునికడకు వచ్చుచునే యుండెను. కాని యొకనాడు రామకృష్ణుడు నరేంద్రా! నేను నీతో మాటలాడకున్నను మామూలుగనే నాకడకు వచ్చుచుంటి వేమికారణమని యడిగెను. అపుడు నరేంద్రుడు నేను మీవాగమృతమును గ్రోలుటకే నే నిటకు వచ్చుటలేదు. మీయందలిగాఢానురక్తిచే వచ్చుచుంటి ననగా రామకృష్ణుడు బ్రహ్మానందపరవశు డయ్యెను.

అఖిలవేదాంతసారస్వరూపుడైన శ్రీరామకృష్ణుని సన్నిధానమున నుండుటయే మహోత్తమతపశ్చర్య, అనుమాన

సాధనసంపద. అట్టిసన్నిధానప్రాప్తి నందినవానికి దేహాభిమానము తనంత తానే నశించును. జితేంద్రియత్వముకూడ నట్లే యలవడును. శ్రీరామకృష్ణుని పారమార్థికదివ్యభావములను గ్రహింప సామాన్యుల కలవి కానిపని పవిత్రమైన యంతఃకరణగలవారికిని, సూక్ష్మగ్రాహిత్వ మలవఱచుకొనిన వారికి మాత్రమే యయ్యది సాధ్యముగా నున్నదగును. అట్టి సాన్నిధ్యమే గురుచరణపూర్వకారాధనమూలమున సాక్షాత్కారమునందుటకు సులభోపాయ మగును.

అద్భుతమైన శిష్యశిక్షణకు రామకృష్ణు డవలంబించిన విధాన మత్యుత్తమమైనది. ఆయన యేశిక్షణనుగాని ఆటలతోను, పాటలతోను, వింతలతోను, వినోదములతోను, హృదయపూర్వకమైన ప్రియభావములతోను, మహోన్నతంబులైన యాధ్యాత్మికవిషయంబులను శిష్యులకు బోధించి, వారిభావిజీవితౌన్నత్యమును కన్నులార గాంచి, తద్విషయముల నెఱిగించి యుత్సాహపరవశుల గావించును. అంతేగాక ప్రతిదినము నడచు జీవితచర్యలనుగూడ కనుగొనుచు నెట్టిస్వల్ప విషయమందుగాని క్రమముదప్పి నడచినచో మంచియుపదేశముల నిచ్చును.

శ్రీరామకృష్ణుని యుపదేశములు పరమాద్భుతములని, ఫలప్రదములునని చెప్పుటకు నిదర్శనములు లెక్కలేనన్ని

యున్నవి. అందొకటి రెండు పరిశీలింతము. ఒకప్పుడు నరేం ద్రుడు ధ్యానమగ్నుడయియుండ నాసమీపమందలి యంత్ర ధ్వనిచే నాతనిమనసు పలుమారు కలతపడ సాగెను. రామకృష్ణ దేవుడు విని యాయంత్రధ్వనిమీదనే మన సుంచుమని చెప్పెను. అట్లుచేయగానే యావిఘ్నము తొలగి పోయెను. మఱియొకప్పుడు ధ్యాననిమగ్నుడై యున్న నరేం ద్రుడు తనకు పూర్వస్మృతి కలుగకున్నదని వచింప రామకృష్ణు డతనిఫాలభాగమును నఖాగ్రముతో నదిమిపట్టి, ఆయనుభవము మీదనే మనసు లగ్నముచేయుమని యాజ్ఞాపించెను. నరేంద్రు డట్లొనర్చి నిశ్చలసమాధిమగ్నుడయ్యెను.

మరియు నాపరమార్థతత్త్వాగ్రేసరుడగు రామకృష్ణుడు శిష్యులకు భక్తులకు బోధించువిధానముగూడ పరమాద్భుత ముగా నుండును. ఏనాడుగాని యతడు తనశిష్యకోటితో తర్కవాదము సాగించియుండలేదు. అతనికటాక్షమో, ప్రియ వచనమో, పాడెడికీర్తనయో బోధనను సాగించును. అందు వను సాక్షాత్కారమందుటే మనుజుని పరమావధియని, పర తత్త్వానందపూర్ణంబగు హృదయమునందు తర్కవితర్కములకు స్థానమేలేదని, జ్ఞాన ముదయింపగానే సంశయమనెడి చీకటి పటాపంచలగుననియు ముఖ్యముగా బోధించును. ఆతని శిష్యులుమాత్రము వాదోపవాదములతో చాటుమాటుల కీచులాడుచునే యుండెడివారు.

ఒకనాటి ప్రాతఃకాలమున శ్రీరామకృష్ణుడు ధ్యాన సమాధిలో నుండెను. ఆయనను జూచుకొని, యతనిశిష్య కోటియంతయు దక్షిణేశ్వరవనంబున నొక్కచో జేరి పరస్పరము, భగవంతుడు సగుణరూపుడా? నిర్గుణరూపుడా? దశావతారములని ప్రసిద్ధినొందిన యవతారములు యథార్థములా? కల్పితములా? అనువిషయమై రెండుపక్షములుగా చేరి వాదోపవాదము లారంభించిరి. అందు ముఖ్యముగా నొకపక్షమునకు నాయకుడై గంభీరస్వరంబున తర్కించువాడున దగు నరేంద్రుడు వాదన సేయుట రామకృష్ణునకు వినవచ్చుచుండెను. శిష్యమానసముల గలంచు నా సందేహాలాపనములు దక్షిణేశ్వరవనప్రదేశమంతట నావరించి ప్రతిధ్వనించుచుండెను. అట్లే మంచుసోనలుగూడ నా తావున దట్టముగ నలముకొనినవి. ఆమంచుసోన లెంతకాల ముండగలవు? సూర్యోదయమైన తోడనే యవి కరిగిపోవునుగదా? అట్లే జ్ఞానసూర్యుడగు శ్రీరామకృష్ణు డప్పుడే ధ్యానోదధినుండి బయలువడి తన దివ్యోపదేశరశ్మిలను బఱపి యా సంశయముల నెడి మంచుసోనల సంతరింపజేయడా? అకస్మాత్తుగా నాశిష్యకోటికర్ణపుటంబుల, చిత్తమా! నీప్రయత్నంబులు పరమేశ్వరుని జూడలేవు. చీకటింటిలో తడవులాడుకొను బుద్ధిహీనునివంటి ప్రయత్నములే నీప్రయత్నములును. అంతేగాక షడ్దర్శనములు, తంత్రములు, చతుర్వేదములుగూడ పరమాత్మదర్శనమును చేయింపజాలవు. సందానందమూర్తియు, హృదయాంత

జ్యోతియునగు నాపరమేశ్వరుడు భక్తిరసప్రియుడు నను దివ్య గానామృతమును విరజిమ్ము వాక్యములు బడినవి. తోడనే వారందఱు దిగ్భ్రాంతులయిరి. వారిసంశయతరువు లాగానా మృతలహరిలో లీనమైనవి.

ఆపరతత్వవిదుడైన శ్రీరామకృష్ణుడు భగవంతుని గూర్చి తర్కించు టవివేకమనియు, భగవత్సాక్షాత్కారమే మతధర్మముల ప్రధానోద్దేశ్యమనియు, కామకాంచనములను జయించి మనోనైర్మల్యము సలవఱచుకొనుటే పరమార్థప్రాప్తికి సాధనోపాయమనియు వక్కాణించును. ఈసాధనసంపత్తి లేనినా డెంతటితర్కశాస్త్రప్రావీణ్యమున్నను, ఎంత మేధా సంపత్తి కల్గియున్నను వ్యర్థమని వచించును. ఈపండితులమని చెప్పుకొను శాస్త్రవాదులందరు గృధ్రములవంటివారేయని, గ్రద్దలు పవిత్రమైన యాకాశమార్గమున విహరింపుచున్నను వానిదృష్టిమాత్రము భూమిమీద గ్రుళ్ళి దుర్వాసనగొట్టు శవములమీదనే నిల్లి యుండునని యట్లే పండితోత్తము లెంతశాస్త్ర ప్రావీణ్యతగలవారైనను వారిదృష్టి శవములవంటి కామ కాంచనములమీదనే యుండుననియు జెప్పును.

అయితే తనశిష్యబృంద మెంతటితీవ్రవాదములలో బడి కొట్టుకొనుచున్నను, నాతడు మందలింపడు. ఏలయన నట్టి చర్చలు నిజమును గ్రహించుటకే యుద్దేశింపబడి చేయు చున్నచో వానివలన జ్ఞానసంపత్తి యధికమగునని యెంచును.

ఇట్లని ప్రతివిశ్వసనీయవిషయమునుగూర్చి వ్యర్థమైన వాదన లారంభించిన తాను సంబంధము కలుగజేసికొని యందు ప్రవేశించితీరును. ఒకప్పుడు నరేంద్రుడు నమ్మకము ముముక్షువులకు సాధనము కాజాలదని, యది గ్రుడ్డినమ్మకమని నిరసనను దెల్పుచు చర్చించుట రామకృష్ణుడు విని తాను కలుగజేసికొని, నాయనా! గ్రుడ్డినమ్మకమని పల్కెదు వేల? నమ్మకమునకు గన్నులున్నవా? నమ్మకమే గ్రుడ్డిది. అది యర్థరహితము. సమస్తతత్వశాస్త్రంబులును, సమస్తవిజ్ఞానమును, అనుభవలేశముతో బోల్చిచూచినచో గ్రుడ్డినమ్మకమే యనును. ఈరీతిగా నెదుర్కొనిన రామకృష్ణునిముందు నరేంద్రుడు మూకియైయుండెను.

నరేంద్రుడీవిధముగా శ్రీరామకృష్ణునిచే మందలింపబడుచున్నను నవకాశము లభించినపుడెల్ల చర్చలలో పాల్గొనుచు తనగర్జనలను చేయుట మానినవాడు కాడు. మఱియొకప్పుడు, శాస్త్రములు యథార్థములేనా? వేదములు పౌరుషేయములా? అపౌరుషేయములా? భగవంతుడనగా నేమి? యనువిషయములపై నరేంద్రుడు ప్రధానవక్తగా నుండి చర్చలు సాగించుచుండెను. గురుదేవు డీచర్చల నన్నింటిని వినుచునేయుండెను. కాని తానందు చేయి చేసికొన్నక స్మితాననుడగుచు నటనుండి నెమ్మదిగా లేచి దేవాలయము సమీపమందలి నావిశ్రాసమూహమున్న కేవుదరిజేరి

యొకచో నిశ్చలచిత్తుడై నిలబడెను. అంతలో శిష్యులు తమ చర్చకు మంగళవాక్యములు చెప్పి ముగించి యట గురుదేవుని గానక యన్వేషించుచు నా యానతిచ్చిన తావున కేగిరి. ఆసమయమున నాప్రదేశమున కొన్ని శ్వానములు కలహించుచు నల్లరిచేయుచు మొఱుగుచున్నవి. మఱియొకప్రక్క కొన్ని శ్వానములు నదీప్రవాహమున బడి వచ్చి తీరమునకు జేరిన యొకకళేబరమును కిక్కుఱుమనకుండ దినుచున్నవి. తన్ననుసరించివచ్చిన శిష్యులను జూచి, యాశ్వానములవైపు వ్రేలు చూపి నర్మగర్భముగా చిఱునవ్వు నవ్వెను. తమ వాగ్వాదములకు శ్వానములను నిదర్శనములుగా చూపి గురుదేవుడు తత్త్వసందర్శనపూర్వకమగు బోధనను గఱపుచున్నాడని యెఱింగి సిగ్గుతో దలలు వంచి నిలిచిరి.

శ్రీరామకృష్ణుని బోధనావిధానమున తీవ్రసాధనతత్త్వముజ్జ్వలించెడిది. తత్త్వదర్శనమే జిజ్ఞాసకు బరమావధియని పలుమారులు శిష్యుల కుద్బోధించెను. ఆయన ప్రతిబోధనయు సాధనరూపముగా ప్రకృతితత్త్వముతో నిరూపించి చెప్పెడివాడు. విశ్వమానవసౌభ్రాతృత్వమును బోధించుచు తా నట్లు సంచరించి చూపెను. అంతియే కాని ప్రపంచమందలి యే సాంఘికాచారమునుగాని యెప్పుడును నిరసించి యుండలేదు. వర్ణాశ్రమాచారములకు రూపింపబడిన ధర్మములకు వ్యతిరేకముగా నే బోధనయు చేసియుండలేదు. బ్రాహ్మణజాతి కెల్ల

నలంకారుడైన గూఢస్వజీవనుడు జాత్యౌన్నత్యమును, కులతత్వ భేదమనెడి నైచ్యమును విస్మరించుటకై నిమ్నజాతులలో గడ పటివారుగనుండి నీచతములుగ నెంచబడు వారు జేసెడి సేవక కృత్యములును హృదయపూర్వకముగా జేసెను. అట్టివినమ్ర భావములు, పవిత్రహృదయము, విశ్వాత్మీయప్రేమమహంబముగల గురుదేవుడు లభించుట చేతనే నరేంద్రుడా గురుదేవుని పాద పద్మసేవాభాగ్యము నొందుటవలననే జగత్కల్యాణకారణ భూతములగు శ్రీ రామకృష్ణమఠములను పలువిధముల లోకోపకారకములైన రామకృష్ణ సేవాసంఘములను స్థాపించి యశోవిశాలుడగుటకు మార్గదర్శకత్వము లభించెను.

ఒకానొకప్పుడు నరేంద్రునితో సాధారణజనులయెడ నత డవలంబింపదగిన సత్యమార్గమును గూర్చి, "వత్సా! ప్రజలు భగవద్భక్తులనుగూర్చి పలువిధములుగా భాషింతురు. కొందఱవివేకులు కేవలము తిరస్కారపూర్వకముగ మాట లాడుదురు. ఆసమయమందుభక్తులైనవారు, గజేంద్రుడు తన వెంటబడి పరిగెత్తుచు మొఱుగు కుక్కలను లక్ష్యపెట్టనిరీతి నిరాఘాటముగా తనమార్గమున తాను బోవలె" నని చెప్పెను. అప్పుడే నరేంద్రునిగూర్చి, నాయనా! ప్రజలు నిన్ను పరోక్ష మున నిందింతురనుకొనుము. అది యెరింగి నీవేమి తలంతువని ప్రశ్నించెను. అపుడు నరేంద్రుడు, వారిని కుక్కలగుంపుగా దలంతుననెను. గురుదేవు డంత, అట్లు కాదు. వినుము. వారి

యరవులను లక్ష్యపెట్టక ప్రతివ్యక్తిని నారాయణాంశసంభవు నిగా నెంచుము. భగవానుడు సర్వాంతర్యామి యగుట వలు విధములుగా పలువ్యక్తులందు నటన చేయును. ఒకసాధువు నారాయణుడైన నింకొకడు క్రూరుడగును.

మఱియొకప్పుడు నరేంద్రుడు నీచదేవతల నారాధించుటను, వామాచారసహితంబులయిన కొన్ని సాంప్రదాయములను నావేశపూరితహృదయుడై ఖండన సేయుచుండ గురుదేవు డాలకించి నరేంద్రా! ప్రతిగృహమునకును దొడ్డిగుమ్మముకూడ నొకటి యుండునుగదా! ఇష్టము కలవా రాద్వారమునుండి పోదలంతురు. వారి నడ్డపెట్టుట వశమా? అది నామతము కాదు. కాని సింహద్వారము వెంబడినే ప్రవేశించుటగాని, బయటకుబోవుటగాని చేయుట, అత్యుత్తమమను విషయమును మాత్ర మంగీకరింపవలయును! అని చెప్పెను. ఇంక భగవత్సాక్షాత్కారమునుగూర్చి ప్రశ్నల నెవరుగాని యడిగినచో, నాయనా! భగవంతుని సంక్లిష్టమైన రూపునిగా భావించి యారాధింపుము. చీమ చిటుక్కుమన్నంత ధ్వనియైన పరమేశ్వరునకు వినంబడితీరును. భగవంతుని కనుగొనుటకు కామకాంచనములను జయించుటే ముఖ్యసాధనము. దానిని సాధించుటకు, శ్రద్ధ, ఓరిమి, మనోనైర్మల్యము నుండితీరవలయును. ఇవి లేనివాడు పడిన పరిశ్రమయంతయు నిష్ఫలమే యగును. అంతేగాక తానెట్టిసాధనలను జేయదల్చించినను నందు పదునారవ భాగమైన నెరవేర్చినచో భగవంతుని దర్శించి తరించుటలో

శంకాలేకింతయైన నుండదు. మఱియు భగవంతుడు సగుణుడా, నిర్గుణుడా యని తర్కించుట వివేకము కాదు. ఆతడు సగుణుడు, నిర్గుణుడుకూడ. సగుణనిర్గుణాతీతుడుకూడ నగును. భక్తునియిచ్ఛానువర్తనము ననుసరించియే భగవానుడు దర్శన మిచ్చును. ఒక్కదేవాలయమే దేవాలయమని తలంచుటయు నవివేకమే. భగవానుడు సర్వాంతర్యామి, సర్వలోకాతీతుడు. ఇంకను విగ్రహారాధనము చేయునగునా యని ప్రశ్నించుటయు నజ్ఞానమే యగును. నీవేరీతిగా నారాధించినను తీవ్రపరితాప మొక్కటిమాత్రమే భగవంతుని సాక్షాత్కారమునొందించును.

శ్రీరామకృష్ణు డొకప్పుడు తనకు ప్రాచీనకాలమందు ప్రపంచమును తనదివ్యబోధనలతో నింపి కొన్నివిషమాచారములను ప్రతిఘటించి ప్రజానమూహమును చైతన్యము నొందించిన చైతన్యస్వామియొక్క బోధనలను గూర్చి ముచ్చటించుచు, భగవన్నామములందు రుచి, సమస్తజీవులందు గారుణ్యము వహించియుండుట, భగవారాధనయు నీమూడును నత్యంతప్రధానములు. అని యాధర్మత్రయమును విపులీకరింప దలంచుచు జీవకారుణ్యపదోచ్చారణమాత్రముననే సమాధిమగ్నుడయ్యెను. కొలదికాలములో సమాధినుండి వెలువడి, జీవకారుణ్య మేలను! అది యేమి చేయగలదు. అది పట్టి యవివేకపుబని. దానిని దెలుపుటకు నీకు శక్తిచాలదని యెఱుంగవు. జీవకారుణ్యము సమంజసము కాదు. జీవసేవ

యనుము. అనగా ప్రతిజీవియు భగవంతుని స్వరూపసత్యమని నమ్మి సేవించుటే జీవసేవ. అనినంతనే గురుదేవుని యాస్య బింబమునుండి వెలువడిన యీసంభాషణము నాలించి శిష్యులు నిశ్శబ్దులైరిగాని యందలినిజతత్త్వమును గంభీరార్థమును శౌక్కవివేకానందునకుమాత్రమే సాధ్యపడినది.

ఆగురుదేవునివాక్యములపై వివేకానందు డిట్లు వ్యాఖ్యానించెను. భక్తినివిడచి చిత్తమును శుష్కింపజేసికొని, ప్రేమానురాగములను మంటగలిపి సంఘమునకు దూరమై, కాననముల చరించి తపించిననేగాని జ్ఞానము పొందబడనేరదని జనసామాన్యము తలంచుట లోకసహజమైనది. ఆత్మసాధనకు విఘ్నములు కలిగించుననుచెడ్డయూహతో తోడిమనుజులయెడలను, జీవసముదాయమందును ద్వేషమును వహించి సాధకుడు మారుమార్గము త్రొక్కుచుండెను. నాగురుదేవుడు తనదివ్యభావమున వివరించిన యీమహోపదేశపూర్వకవాక్కులవలన సంఘమును వీడి యతులును, మునులును గావించు తత్త్వజ్ఞానసాధన గృహమందుండియే మనుజుడు చేయవచ్చునని నాకు స్పష్టపడినది. అంతేగాక నిత్యకృత్యములందే యనుష్ఠానమున వేదాంతము చూపసాధ్యమగునని గ్రహించితిని. సమస్తజీవసముదాయము సాక్షాద్భగవత్స్వరూపమేయని మానవు డేయాశ్రమమందున్నను, ఏవృత్తియందున్నను గ్రహింపవచ్చును. ఆభగవానుడు జగదంతర్యామి, జగదధీశుడు ననుబ్రహ్మజ్ఞానమే

సిద్ధించినచో నహంభావమునకు చోటే లేదు. మానవసేవయే మాధవసేవ. భగవంతునిదయయే నాయందు ప్రసరించినచో నెన్నటికైన నాగురుదేవునిబోధయందలి మహత్తరసత్యమును జగంబునకు నిరాఘాటముగా జాటునుదినము రాకపోదు.

జగద్విఖ్యాతకవిచంద్రుడును, నిఖిలదిగంతరవ్యాప్త యశోవిశాలుడునైన స్వర్గీయ శ్రీరవీంద్రనాథఠాగూరుమహాశయు డొకప్పుడు శ్రీరామకృష్ణపరమహంసనుగూర్చి ముచ్చటించు, “ శ్రీరామకృష్ణుని దివ్యజీవితమున పరిపూర్ణతాపరమానందప్రాప్తిసాధనములైన వివిధోపాసనావాహినులావిజ్ఞానసాగరమున లీనములైనవి బ్రహ్మానందతేజోరూపములుగా వికాశమునంది సామరస్యదేవాలయమును నిర్మించియున్నది. ” అని వాక్రుచ్చెను.

నేటిరాజకీయవేత్తలకు తలమానికమై, భారతదేశమందలి నలుబదికోట్లమానవప్రపంచముచే భారతదేశమున కేకైకనాయకుడని, అవతారపురుషుడని, జగంబునుద్ధరింప నుద్భవించిన మహాదివ్యతేజస్సంపన్నుడని శ్లాఘింపబడు గాంధీమహాత్ముడు శ్రీరామకృష్ణపరమహంసనుగూర్చి ప్రశంసించుచు, “ సనాతనధర్మతత్త్వమూర్తిత్వమే శ్రీరామకృష్ణుడని, సజీవాకృతిని దాల్చిన దివ్యత్వమే సాత్వికవ్యక్తిత్వము ” నని వక్కాణించియున్నాడు.

ఇట్టిమహనీయునకు శిష్యరూపుఁడుగా నుద్భవించిన యాచదువులసరస్వతియనం దగు నరేంద్రుఁడు శ్రీరామకృష్ణసద్గురు చరణారవిందసేవ జేసిన దారేండ్లమాత్రమేయైనను, అత్యంత శాంతిప్రదాయకమగు బోధనలతో, జ్ఞానసంగ్రహణేచ్ఛాదీక్షతో, దివ్యానుభవములతో విరాజిల్లిన తత్కాలమునందు తనజీవితమున నఖండానందదాయకమగు గొప్పదశగా నెంచెను. అంతేగాక శ్రీరామకృష్ణుఁడు కామాద్యరిషడ్వర్గము నవలీల వివేకవైరాగ్యసాధనములచే జయించి ధ్యానధారణాదులు మొదలగు నుపాయములచే నాత్మసామ్రాజ్యాధిపతియై తాను నముపార్జించిన తత్త్వజ్ఞాననిధికి తనశిష్యాగ్రగణ్యుఁడగు నరేంద్రునే వారసునిగా జేసెను. ఆయాత్మసామ్రాజ్యమునకు గొంత కాలము యువరాజుగ, కొంతకాల మేకచ్ఛత్రాధిపతియైన సార్వభౌముఁడుగ విషయవాంఛాధిక్యమున లౌకికాశయమయం బగు పశ్చిమఖండమును జయించి తనయాత్మసామ్రాజ్యమును దిగంతరములవఱకు వ్యాప్తి నొందించి ధర్మసముద్ధరము జేసెను. శ్రీరామకృష్ణుఁడాధ్యాత్మికమహోదధియందు మగ్నుఁడై కను గొన్న దివ్యానుభవరత్నరాసులను ప్రపంచమున నరేంద్రుఁడు విరజిమ్మెను. శ్రీరామకృష్ణుని దివ్యానుభవములను లోకము లకు జాటి తనవివేకానందనామమును సార్థకపరచుకొని చతు స్సముద్రముద్రితమహీవలయంబున నారామకృష్ణుని బోధనామృతకణముల నొలికించి మించెను.

శ్రీరామకృష్ణుని బోధనలను, ఆయనవ్యక్తిత్వమును, మహాత్వమును నిజరూపమున నెఱింగిన శిష్యులలో వివేకానందుడే యగ్రగణ్యుడు. తనగురుదేవు డవతారపురుషుడా, కాడా యనుసంశయము నాత డెప్పుడును ప్రధానముగ గణింపనే లేదు. అవతారమాటకేమి కేవలము తనగురుదేవుడు సమస్తవాదాతీతుడని, సత్యాన్వేషకుల కందఱకు భవిష్యన్మార్గదర్శకుడని, తత్వజ్ఞానసాధనల కేకైకసాగరమని, శంకరాచార్యుని యఖండధీశక్తియు, చైతన్యదేవుని వినిర్మలప్రేమము, బుద్ధభగవానుని సర్వజీవకారుణ్యము నేకమై రూపొంది సనాతనధర్మసముద్ధరణార్థము రామకృష్ణుడయ్యెనని విశ్వసించి సేవించి చరితార్థుడయ్యెను.

ఆదివ్యపురుషుని యుపదేశములు, బోధనలు, లీలలు ఎంత వర్ణించినను తనివితీరదు. అయినను నామహామహుని యాత్మజ్ఞానరూపము అమృతత్వమునంది, విశ్వకళ్యాణహేతుభూతముగను, ముముక్షుజనమార్గదర్శకముగను నగునాదివ్యయోగిలీలలు గొన్నిటిని చవిచూపుట మాకు ధర్మముగావున నాలీలలను ప్రత్యేకప్రకరణముగ వ్రాయనుంకించినాము.

---

# ౬

# దివ్యోపదేశలీలలు.

"ఆయువు వీచిచంచలము యౌవన మల్పదినోచితంబు పు
ష్పాయుధ కేళిజన్యసుఖ మస్థిర మర్థము వాంఛవోలె సా
పాయము భోగముల్ మెఱపులట్ల భ్రమించు భవాబ్ధి లంఘనో
పాయము బ్రహ్మచింతనము బాయక చేయుడు సజ్జనోత్తముల్."

ఆహా ! భగవంతునిలీల లద్భుతములు, అనంతములు, ఆశాంతరవ్యాప్తములు, అనన్యసామాన్యబోధకములునుగదా! పారమార్థికాశయములతో, మహోత్తమతపశ్చర్యతో, ఆత్మసందర్శనశక్తిసామర్థ్యములతో గూడిన ప్రాచీనజాతీయజీవనగంగాప్రవాహముగ భారతదేశమున దనయుపదేశానుభవములను శిష్యపరమాణురూపములతో వెదజల్లిన శ్రీరామకృష్ణపరమహంసజీవితముగూడ నొకభగవల్లీలయేగదా ?

భరతఖండమందేగాక యావత్ప్రపంచమునకు నూతన జాతీయాదర్శములతో, ప్రకృతిశాస్త్రవిజ్ఞానప్రదర్శనములతో, ఆత్మవిషయికసంశయభావములతో గూడిన నవీనభారతజాతీయజీవనయమునాప్రవాహముగ నుద్భవించి సనాతనధర్మపునఃప్రతిష్ఠాపన మొనర్చిన వివేకానందస్వామిప్రతిభయు నొకభగవల్లీలయేగదా ?

ఆ రామకృష్ణవివేకానందులను గురుశిష్యరూపమున సమ్మేళన మొనరించి, నవీనప్రాచీనాదర్శముల నద్భుతవిధానమున సమన్వయించు భారతపునర్జీవనదివ్యవాహినిగ నొనర్చి, లోకసంగ్రహాకర్మాచరణముతో సర్వసంగపరిత్యాగమును వియ్యమొందజేయ, పాశ్చాత్త్యులతీవ్రకార్యదీక్షతను భారతీయుల ప్రశాంతియుతాత్మధ్యానదీక్షతో మేళవింపజేసి, సనాతనధర్మ పునఃప్రతిష్ఠాపనవిధానముల నన్వేషించి, యాదివ్యవాహినిని యావత్ప్రపంచమునకు బాఱజేసి, లోకోత్తర దివ్యబోధనా పద్ధతులతో శాఖలుగ, ఉపశాఖలుగ మరలింపజేసి సుస్థిరధర్మ సిద్ధాంతరూపకసత్యపథమున గుప్పింపజేయుటయు నొకభగవల్లీలయేకదా ?

ఆ శ్రీ రామకృష్ణపరమహంస జగత్కల్యాణార్థముగ స్వలీలలుగ నెఱపిన యుపదేశవాక్యపరంపరను, ప్రశ్నసంపుటిని, వానియుత్తరువులు సమగ్రరూపములను వివరించి యందలియందలియాథార్థ్యతను జనసామాన్య మెఱుంగ నిర్వచింపుచున్నాము.

(1) మానవుడు భగవంతునెట్లు ప్రేమింపవలయును?

సాధారణముగా భగవంతునిమీద ప్రేమ యలవడుటే కష్టము. అట్టిది సంభవించెనేని సాధ్వీమతల్లి యనిపించుకొను నిల్లాలు తనపతిని ప్రేమించినట్లును, ధనమే యిహపరసాధనమని

యెంచు పరమలోభి తా నార్జించిన ధనరాశిని ప్రేమించినట్లు భక్తుడు హృదయపూర్వకముగ భగవంతుని ప్రేమింపవలెను.

(2) మనుష్యులు భగవంతు నెట్లుచూడగలుగుదురు?

మానవుడు, జాలరివాడు పెద్దచేపను బట్టుకొనుటకు గాలమున కేదో యెఱ బెట్టి నీటిలో బడవైచి చేప దాని నాకర్షించువఱకు నిరీక్షించుచుండినట్లు, భక్తిసాధనములను జేయుచు నోర్మితో నిరీక్షించియున్న భగవంతుని చూడగలుగును.

(3) మనుష్యులలో భగవద్భక్తి యెంత కాలముండును?

నిప్పులో వేసి కాల్చబడిన నయఃఖండము (ఇనుప తునక) ఆనిప్పుతో సంసర్గము కలిగి యందున్నంతసేపు నెఱ్ఱగా గాన్పించుచు నిప్పునుండి బయటకు తీయగానే తననల్లనిరూపము నందునట్లె మానవుడు భగవత్సంసర్గ మెంతకాలము కలవాడగునో, అంతవఱకె భగవద్భక్తి కలిగియుండును.

(4) చిత్తశాంతి యొకప్పుడు కలిగి మఱొకప్పుడు లేకుండ చిరస్థాయిగ నుండకపోవుటకు హేతువేమి?

ఆత్మజ్ఞానాసక్తునకు దప్ప తక్కినవారికి మనశ్శాంతి నిలకడగా నుండదు. వెదురుకఱ్ఱ నంటించిన నిప్పు మాటిమాటికి, ఊది రగుల్కొల్పక పోయినచో నది తొందరగా ఆరిపోవును.

అట్లే యాత్మజ్ఞాన మనియెడి యగ్ని యారిపోకుండ సదా ప్రజ్వలించుచుండుటకై భగవంతునియం దవిరళభక్తి గల్గియుండవలెను. అది కుదరనిచో చిత్తశాంతి కలుగదు.

(5) ప్రాణములమీాది తీపి విసర్జించుట యెట్లు?

ప్రాణములమీాది తీపి నశించుటకు తత్వవిచారము చేయవలెను. మనుష్యుని దేహము నశించెడి స్వభావముకలదై, తొందరగా కుళ్ళునదై రక్తము, మాంసము, ఎముకలు, చర్మము, క్రొవ్వు మొదలగు పదార్థములతో నిర్మాణింపబడినది. ఆశరీరమునందలి భాగముల నన్నిటిని పరిశీలించి తత్వవిచారము జేసినచో ప్రాణములమీాది తీపి యెవనికిని ఉండదు.

(6) సంపూర్ణమైన విశ్వాసము అననేమి?

సంపూర్ణవిశ్వాసమనగా రోజంతయు శ్రమపడి పనిచేసి దానివలన గలిగిన యాయాసమును దీర్చుకొనుటకై చాలీమన జేరబడి నోట తమలమునుంచుకొని, ఘూటైనచుట్టను గాల్చుకొనుచు మానవుడు హాయిగానుండుట. ఆసమయమున నెట్టి విచారముగాని, మనోవ్యధగాని కలుగదు.

(7) మానవునకు ముక్తి యెపుడు లభించును?

మానవునకు నేను, నాది, నావాడు అనెడి అహంకార మమకారము లెపుడు లేకుండ పోవునో యప్పుడే ముక్తిపదము లభించును.

(8) భక్తునకు బలమొసంగున దేది ?

తల్లి కన్నులనుండి నీరు కాల్వలు గారునట్లు వెక్కి వెక్కి యేడ్చెడి బిడ్డను యోదార్చి యామెకోరికను దీర్చినట్లే యేడ్చుచున్న భక్తుని భగవంతుడు దయతో నోదార్చి యాదరించును. అందువలన కన్నీరే బలము.

(9) భగవంతు డెచ్చట నున్నాడు ? అతని నెట్లు చేరగలుగుదుము.

మహాసాగరమున మునిగి ముత్యములను గోరువాడా ముత్యములు లభించువఱకు మాటిమాటికి నాసాగరమున మునకలు వేయుచునే యుండవలెను. అట్లే భగవంతుడు ప్రపంచమున నున్నాడు. అతనిని జూడదలంచితివేని నీవు పలు కష్టములందు మునిగి తేలుచు ప్రబలప్రయత్నము జేసిన భగవంతుని జేరవచ్చును.

(10) కలియుగమున ఉత్తమభక్తి మార్గ మేది ?

కలియుగమున మానవుడు తాను తరించి యితరులను తరింపజేసి యుత్తమభక్తుడనపించుకొనుటకు భగవన్నామ స్మరణయే చేయవలయును.

(11) మనసులోని దుష్టచింత యెట్లు తొలగును ?

పుష్పములనుండి పండు క్రమక్రమముగా నభివృద్ధి యగుచున్నప్పు డాపువ్వునందలి రేకు లొక్కొక్కటిగా రాలి,

పోయినవిధమున భగవద్భక్తిభావము మనసులో నెక్కువైన కొలది దుష్టచింతలు తమంతదామే నశించును.

(12) స్త్రీపురుషులలో నేయొక్కరుగాని జీవితము నెట్లు గడపవలెను ?

స్త్రీగాని పురుషుడుగాని కంసాలి కుంపటిమీది నిప్పుకణములను చల్లారకుండునట్లు శ్రవణముతో వానిని మాటిమాటికి కదుపుచుండువిధముగా మనస్సును మంచివారితో స్నేహము చేయుటకు ప్రోత్సహింపవలెను.

(13) హిందువులలో ననేక మతములున్నవి. అందు దేనినవలంభింపవలెను ?

ఒకదినమున పార్వతీదేవి భర్తతో సల్లాపము లాడుచు నిట్లు ప్రశ్నించెను. "స్వామీ! నిత్యమై, నిర్మలమై, నిరుపమానమై పరోత్కృష్టమైన యానందమునకు మూలమేమి ?" అంత పరమశివుడు, ఆయానందమునకు విశ్వాసము మూలమనియు, మతములయొక్కయు, శాఖలయొక్కయు విశేష లక్షణము లప్రధానములనియు, ప్రతిమానవుడు తనమతమునకు విధ్యుక్తములైన ధర్మములను భక్తిశ్రద్ధలతో జేసిన చాలును.

(14) పరమేశ్వరునిదర్శనము చిత్త మెట్టిదశలో నున్నప్పు డగును ?

భగవంతునిదర్శనము మనస్సు నిర్మలమై, శాంతముతో నుండినేని సులభముగా నగును. మనస్సు సముద్రమువంటిది. అందు కోరికలనెడి వాయువులచే కలతపెట్టబడుచుండును. ఆసమయమున భగవంతుడు మనస్సముద్రమున ప్రతిఫలింప జాలడుగాన నాసమయమున భగవంతుని చూచుట సాధ్యము కాదు.

(15) శరీరములో నాత్మ యేరీతిగా నుండును ?

ఆత్మ శరీరమునందు చిమ్మనక్రోవిలో దాని నంటియు నంటకయు నుండి కొట్టెడి కఱ్ఱవలె నుండును.

(16) ఐహికసంబంధమగుసుఖాసక్తి యెప్పుడు నశించును ?

భగవంతుడు పరిచ్ఛేదశూన్యుడు. ఆయనయందు సకలసుఖములయొక్కయు, సమస్తసంతోషములయొక్కయు సమీకరణము కలదు. ఆభగవంతునియందు రమింప నిచ్చగలవారు తుచ్ఛములను, హేయములునైన ప్రాపంచికవిషయసుఖముల నపేక్షింపరు.

(17) సర్వవ్యాపకుడని చెప్పబడు భగవంతుని యందరము ఏల చూడజాలము ?

ఒకచెఱువులో నాచు, జమ్ము, కాడలు, తూడులు, తుక్కు మున్నగునవి యావరించియుండును. నీవా చెఱువుగట్టున

నుండి చూచిన దానిలోని నీరు కాన్పింపదు. నీరు చూడ దలంచిన యందున్న నాచుమున్నగువానిని తీసిపారవేయవల యును. అట్లే నీకన్నులను మాయ కప్పివేయుచున్నది. అందుచే నీవు భగవంతుని చూడజాలవు. భగవంతుని తప్పక చూడదలచితివా నీకన్నులను గప్పు మాయను త్రోసివేయుము.

(18) భక్తుడు తనయిష్టదైవముకొఱకు సర్వము నేల విడుచును ?

పురుగు తనకంటికి వెలుతురు కాన్పించెనేని యంధ కారములోనుండి చివాలున వెలుగుకడకు బోవును. చీమ చెఱకుపానకములోనే పడి చచ్చునుగాని యాపానకమున్న పాత్రను విడువదు. అట్లే భక్తితత్పరుడైన భగవద్భక్తుడు సమస్తమును విడిచి తనదైవమునే చేరుకొనును.

(19) బ్రహ్మసమాజమునకు హిందూమతమునకు తార తమ్యమేమి ?

బ్రహ్మసమాజమునకు స్వర మొక్కటియే. హిందూ మతమునకు బహుస్వరములుగలవు. బ్రహ్మసమాజమతస్థులు 'ఏక మేవాద్వితీయం బ్రహ్మ' అనునొక స్వరముతో తృప్తి నందియున్నారు. హిందూమతస్థులు శ్రావ్యమైనమధురగానము నకు కారణమగు ననేకస్వరములను గలిగియున్నారు. ఈ రెండు మతములవారును తమతమకార్యముల నభిమానముతో సాగింతురు. ఆపనిని జేయుంచునది నాతల్లియైన కాళిమాతయే.

(20) ప్రథమమున పవిత్రమములైన మతములు క్రమముగా నేల క్షీణించును ?

వాన నీరెప్పుడును పరిశుభ్రముగానే యుండును. ఆ నీరేవస్తువుమీద బడునో యావస్తువుయొక్క శుద్ధాశుద్ధస్వభావములు దానికి కలిగి యట్టిమార్పునందును. ఇంటిమీదగాని యెచ్చటగాని మలినమున్నచోట పడిన మలినముగా నుండును. మంచితావులందు బడిన స్వచ్ఛందముగనే యుండును. మతములుకూడ నట్లే.

(21) రామకృష్ణప్రభూ! తామేల భార్యాసహితులై సంసార మొనర్చరు ?

పార్వతీపరమేశ్వరులకు ముద్దుబిడ్డడును, దేవసేనాధిపతియునగు కుమారస్వామి యొకదినమున తననఖంబులతో నొకపిల్లిచెంపమీద గీకెను. అతడు గృహము చేయసరికి తల్లి చెంపమీద గీరినట్లు కాన్పించెను. కుమారస్వామి, అమ్మా! నీచెంపమీదబరుకు లెట్లు వచ్చినవనియడిగెను. ఆమె ఈబరుకులు నీగోటితో గీసినవే యనగా నతడు, నిన్ను నేనెప్పుడును బరకలేదు. నీవు చెప్పుమాటలు వింతగానున్నవనెను. అంతనామె నేడు నీవొకపిల్లిని బరికితివిగదా యన నతడు, పిల్లిచెంపమీదబరుకుట నిజమే. అట్లయిన నీచెంపమీదబరుకు లేల రావలెను. అనగానే పార్వతి, తండ్రీ! ఈప్రపంచమున నేను తక్క యితరవస్తువేదియునులేదు. ఈచరాచరప్రపంచమంతయు నేనే. అందు నీవెవరికి కీడొనర్చినను నాకే చెందునని చెప్పగా

నతడాశ్చర్యమంది, జగమ్మునందలి స్త్రీలందఱు తనకు తల్లులే గాన నతనికి స్త్రీలందఱు మాతృరూపులుగా గనబడుదురు గాన వివాహమాడక బ్రహ్మచారిగా నుండెను. అట్లే నేనును లోకమందలి స్త్రీలందఱు నాకు తల్లులుగనే యెంచి బ్రహ్మ చర్యవ్రత మవలంబించితిని. గొప్పయింటిపతివ్రతలయిన స్త్రీ లను నేను జూడగనే నాతల్లి పార్వతి యారూపముతో వచ్చి నట్లు గనబడును. నగరములందు సిగ్గువిడియములను విడచి నీచమార్గానువర్తినులై యలంకరించుకొని వీధివాకిళ్ళలో నిలబడి పురుషులరాక కెదురుచూచు జారస్త్రీలను జూచి నప్పుడును నాతల్లి పార్వతి యీవేషముతో వచ్చినదని భావిం తునని చెప్పెను.

(22) నేటికాలపు మతబోధనల గూర్చి మీయభి ప్రాయమేమి ?

అన్నము వండునపుడు మానవుని కొక్కనికి సరిపోవు నంత వండి నూరుమందిని భోజనమునకు పిలుచునట్లిమతబోధ యున్నది. ఇతరులకు బోధించుకాలమును భగవదారాధనకే వెళ్ళించుట మంచిది. అదియే సద్బోధ. ఎవడు ముందుగా ముముక్షుత్వమునొంద యత్నించునో వాడే మహాబోధకుడు. అనేకు లెచ్చటనుండి వత్తురో సిద్ధునికడకు వచ్చి యాత్మతత్వ విద్య నేర్చుకొందురు. వారి నెవ్వరును పిలువలేదు. వికసించిన పుష్పముకడ కనేకతావులనుండి తుమ్మెదలు పిలువకనే వచ్చి

తిన్మకరంపమును గ్రోలునుగదా ! మెడలో డవాలీ వేసుకొన్న రాజభటునిజూచి యెట్టియుల్లరివారుగూడ తొలగిపోవుట, వాని పలుకుల నందరును గౌరవించుటకును కారణము వానిడవాలీ బలమో యట్లు నీవు ముందుగా దేవునివలన బోధనాధికారము నకు నగిన యావేశమును సంపాదించిన నీబోధనల నందరును విందురు. వానిని తలదాల్తురు.

(23) పంచవిధములుగ నుండు సిద్ధులెట్టివారు ?

ప్రపంచమునందలిసిద్ధులు స్వప్నసిద్ధులు, మంత్రసిద్ధులు, హఠసిద్ధులు, కృపాసిద్ధులు, నిత్యసిద్ధులు. ఇందు స్వప్నసిద్ధు లనగా స్వప్నములలోనే జ్ఞానబోధప్రాప్తియై సిద్ధినందినవారు. మంత్రసిద్ధులనగా నుపదేశమునొంది సిద్ధినొందినవారు. హఠ సిద్ధులనగా భూమిని ద్రవ్యముండగా పాతందొరికి భాగ్యవంతు రాలయిన పిల్లను వివాహమాడుట్లవల్లగాని, మఱేవిధముగా నైన హఠాత్తుగా భాగ్యము లభించుటవల్లగాని దరిద్రుడు భాగ్యవంతుడైనట్లే పాపకర్ములు పశ్చాత్తప్తులైగాని, మరే యితరసాధనములవలనగాని హఠాత్తుగా సిద్ధినందినవారు. కృపా సిద్ధులనగా పరమదరిద్రుడైనవాడు రాజానుగ్రహమువలన భాగ్యవంతుడైనట్లే పరమేశ్వరుని యనుగ్రహమువలన నాత్మ జ్ఞానప్రాప్తి కలిగి సిద్ధినందినవారు. నిత్యసిద్ధులనగా గుమ్మడి తీగ ముందు కాయలుకాచి తర్వాత పువ్వుపూచినట్లు మొద టనే పరిపూర్ణత్వమునంది సత్కార్యాచరణంబున గాక ముందు

గానే సిద్ధులయి జన్మించి తర్వాత మంచికర్మములను జేయు వారు. వారు చేయుకర్మలు కేవలము మానవకోటికి కర్మాచరణమార్గమును చూపునవే కాని తాము సిద్ధి నందుటకు చేయునవి కావు. శుకయోగి, నారదుడు, శంకరాచార్యుడు, ఏసుక్రీస్తు మొదలగు వారందరు నిట్టివారే. ఆకాశమునందు మహోన్నతప్రదేశములందు హోమపక్షులనెడి యొకజాతిపక్షు లుండును. ఆతావులు వానికి ప్రియతమములు. అందుండి క్రిందికి వచ్చుట కవి యిష్టపడవు. అవి యాకాశమునందే గూళ్ళు కట్టుకొని గ్రుడ్లను బెట్టును. భూమియొక్క ఆకర్షణ శక్తివలన నాగ్రుడ్లు క్రిందికి దిగజారును. అట్లు దిగజారుటకు భూమికిని, ఆగ్రుడ్లున్నతావులకు నత్యంతదూరమైనందున కొంత కాలము పట్టునుగాని యాగ్రుడ్లు నేలమీద బడకుండగనే తల్లులు పొదిగి పిల్లలను జేయును. ఆపిల్లల కూర్ధ్వలోకమున నుండుటచే ప్రకృతిలక్షణముచేత క్రిందికి జారుట మాని తల్లి పక్షులకడకు పైకే పోవును. అట్లే నారదాదులుకూడ పసితనమునందే యీజగత్సంబంధములగు క్రియాకలాపములను విడిచి యూర్ధ్వలోకమునందే దృష్టినుంచినవారై దివ్యజ్ఞానతేజస్సంపన్నులై చరితార్థులై నిత్యసిద్ధు లనిపించుకొనిరి.

(24) మానవునకు స్వేచ్ఛ యెపుడు లభించును ?

మానవు డెప్పుడు అహంకారమమకారములను త్యజించి పరమాత్మయందు లగ్నమగునో యప్పుడు స్వేచ్ఛ దొరకును.

పిల్లలు వందలు, వేలు గాలిపడగలు చేసి గాలిలో కెగురవేయు నవు డందేయొకటి రెండో త్రాడు తెంచుకొనిపోవును. ఆవిధముగానే వందలు వేలుగ నున్నసాధకులలో నేయొకరిద్దరు మాత్రమే సంసారబంధనములను ఛేదించుకొని ముక్తిప్రాప్తి నందుదురు.

(25) భక్తునకు బలకర మిచ్చున దేమి ?

భక్తుడెప్పుడును దేవుని కిష్టమైన కొడుకువంటివాడు. కావున కన్నీరే యాతనికి బలము.

(26) భగవత్సాక్షాత్కారము నందినవానికిని, అందనివానికిని ప్రవర్తనలో నెట్టిభేదముండును ?

క్రొత్తగా నత్తవారింటికి కాపురమునకు బోయిన యువతి తనకు సంతానము కలుగువఱకు చాలజాగరూకతతో గృహకృత్యములను నిర్వహించుచు సర్వదా పనిపాటలనే చక్క బెట్టుకొనునట్లు మనుష్యుడు భగవత్సాక్షాత్కారములేక యజ్ఞానములో బడియున్నంతకాలము నట్లే ప్రపంచవ్యాపారముతో సమస్తమునని నిర్వహించుచుండును. అనూతనముగా కాపురమునకు వచ్చినయువతికి సంతానము కలిగినప్పటినుండి యింటిపనులమీద దృష్టిసరిగా నిలుపక నాగృహకృత్యములను చేయుటలో సంతోషముంటక, తనబిడ్డతోనే స్వర్గము మోక్షమునని రెండవపనిపై ధ్యాసయేలేక తనబిడ్డతో ముద్దుముచ్చట

లాడుచు కాలము పుచ్చునట్లే మానవుఁడు భగవత్సాక్షాత్కారమైనప్పటినుండి ప్రపంచవ్యాపారములమీఁద రోఁతకలిగి యట్లే భగవంతు నారాధించుటయందు దృష్టి నిలుపును.

---

# ౮

# రామకృష్ణనిర్యాణము.

"జననీ మేదిని తాత మారుత పయస్సా వహ్ని చుట్టంబ జీ
వనమా సోదర తారకాపథమ భవ్యప్రేమ సంధిల్ల మీ
కొనరింతుం జరమప్రణామము భవద్యోగస్ఫురత్పుణ్యసం
జనితజ్ఞాన నిరస్తమోహాతిశిన్నై సద్బ్రహ్మమ్ముం బొందెదన్."

శ్రీరామకృష్ణపరమహంస తన హృదయసీమయందలి క్షీరకణములను హిందూదేశ మన్నిప్రక్కలకును చిందులాడుచుండు సమయమున నామహానీయునికంఠసీమయం దొక వ్రణము పుట్టెను. అందువలన దక్షిణేశ్వరమునుండి వైద్యసౌలభ్యముకొఱకు గలకత్తాకు శిష్యబృందము గొనివచ్చి సుప్రసిద్ధవైద్యశేఖరులచే చికిత్స చేయింప నారంభించిరి. ఆ కంఠవ్రణబాధ నించుకేనియు లక్ష్యపెట్టక, భవరోగవైద్యుడగు నామహాశయుడు వైద్యశేఖరులు విశేషముగ మాటలాడరాదని, సమాధిస్థితిని బొందరాదని చెవి నిల్లుగట్టుకొని

పోరుచున్నను తనహృదయకమలమునుండి జాలువాఱు దివ్య జ్ఞానసుగంధసంభరితములగు వాగమృతవాహినులను పరమార్థ పిపాసచే నరుదెంచు జనులకు ధారవోయుట మానడయ్యెను. గంగానదీప్రవాహము నరికట్టగలవారును, పద్మసుగంధవ్యాప్తిని వారించువారును లేరుగదా — అసుగురుదేవుని సన్నిధానము శిష్య బృందమున కంతకంతకు భగవద్భక్తివిశ్వాసముల నినుమడింప జేయుచుండ నాతనిశిష్యులలో నఖండయశోవిశాలురగు విజయ కృష్ణగోస్వామి, గిరీశచంద్రఘోషు మున్నగువారు శ్రీరామ కృష్ణు డవతారపురుషుడని ప్రకటించుటచే నతనిమహిమంబు లను గనుగొన శిష్యకోటియు, ప్రజాకోటియు నిరీక్షించు చుండెను. అట్టిసమయమున రామకృష్ణుని యశోవల్లరులతో బాటు వ్యాధియు వృద్ధియగుచుండెను. అంత శిష్యులాయన కనుకూలమైన యారోగ్యవాతావరణమును గల్పింప కాశీపుర వనమునం దొక ప్రశాంత వనప్రదేశమునకు గురుదేవుని బస మార్చిరి.

అయ్యా రామప్రవేశము రామకృష్ణలీలాప్రదర్శనము నందలి తుదియంకమునకు ప్రస్తావనారంభమయ్యెను. తనదివ్యోప దేశమరందమును ముముక్షుభ్రమరముల వేలకొలది కొసంగిన యామందారము ముకుళించుసమయ మాసన్న మగుచుండెను. ఆయనమరణశయ్యయందుండియు తాను జేయదలచిన కార్య నిర్వహణమున శేషించిన పనినిదీర్ప శక్తివంతులగు శిష్యుల

నేర్పాటుగావించు నుద్యమమునే సాగించుచుండెను. అట్టిగురు పాదునిసేవయే భగవదారాధనమని విశ్వసించి యహోరాత్రములు శిష్యు లేకరీతిగ నిద్రాహారములను విసర్జించి గురుదేవుని సేవించుచుండిరి. ఆయనశరీరము పూర్ణశిథిలత నందుటకెంతయోగడువు లేదని చెప్పుచున్నను వదనమండలముమాత్రము జ్ఞానతేజోవిరాజితమై, పీసమేనియు వికాసము దగ్గక భాసిల్లుచుండెను.

నానాటికి రామకృష్ణునివ్యాధి తీవ్రత నందుచున్నను ముఖచంద్రుడు దివ్యకళాశోభితుడై యుండెను. ఆసమయమున నరేంద్రుని బిలిచి, నా యనా! నాయమాయకత్వమును, విద్యావిహీనతను జూచి లోకులు నన్ను వశపఱచుకొని దుర్లభదివ్యానుభవముల నొందకుండుటకై నన్నీలోకమునుండి గొంపోవనున్నది. పారమార్థికసాధన లెంతయో కొఱవడియున్నవి. శరీరమున్నంతవఱకు బాధ ననుభవించితీరవలెను. అందుచే నాకు జన్మరాహిత్యము చేయుమని తల్లి నడుగుదును. అయినను దేహము దివ్యానందదాయకము. భగవంతుడు భక్తరక్షణకై యవతరించుచుండునని పలికి నరేంద్రు నవలోకించి తత్త్వోపదేశమును గూర్చియు, సాక్షాత్కారానంతరము మానవుని స్థితినిగూర్చియు కొంతప్రసంగించెను.

ఇంక శ్రీరామకృష్ణుని జీవితమందలి శేషదినములు శిష్యపరమాణువులకు చిరస్మరణీయములు. ఒకనాడు అద్వై

కానందస్వామియను శిష్యుడు కొన్ని కాషాయాంబరములను, రుద్రాక్షమాలికలను దెచ్చి సన్యాసులకు బంచమని యందరు నాతనితో, వత్సా! ఇదుగో! ఈబాలురు వైరాగ్యప్రపూర్ణులు వీరికంటె మహిమాన్వితులగు సన్యాసు లీజగంబున లేరు. వీరికే వానిని బంచిపెట్టుమని యాజ్ఞాపించి, యాబాలురను రావించి, కాషాయవస్త్రాదులను వారి కిప్పించి సన్యాసదీక్ష నొసంగి వారిని భావి శ్రీరామకృష్ణమత ప్రదీపకులుగ జేయు వా రమందానంద మందిరి.

శ్రీరామకృష్ణుని నిర్యాణసమయము సమీపించినది. ముముక్షుమార్గదర్శకమగు నాదివ్యజీవన ప్రదీపము మినుకు మినుకు మనుచుండెను. ఆయన మితిలేని బాధ నందుచో నరేంద్రుని జేరబిలిచి, నరేంద్రుడు డికముం దన్యులకు బోధకాగలడని కాగితముపై వ్రాసియాయన నత డందుకొని, నేనట్లు జేయు ననెను. నీవట్లు జేసితీరుదువనియు, కొలదికాలములో నాయోగసిద్ధులన్నియు నీమూలమున జగద్వ్యాపితములు కాగలవని వక్కాణించెను. ఆగురుదేవుడు తన కంత్యదినము లాసన్నమైనవని యెఱింగి యోపికలో నోపిక జేసికొని శిష్యకోటి కంతిమాధ్యాత్మికబోధ గావించుచుండెను. ప్రతిదినము నరేంద్రు నెన్నిమారులో బిలచుచు దనకు బిదప శిష్యుల నాతడెట్లైక్య సూత్రబద్ధుల జేయవలెనో, సన్యాసజీవితాదర్శకములగు శక్తి

ప్రభావములను వారి కెట్లలవరచవలెనో, ఎట్లు ప్రేమించి వారి నాదరింపవలెనో పునఃపునరాదేశము గావించుచుండెను.

ఆగురుపాదుని సమాధి కిక దినత్రయము వ్యవధి యున్న దనగా నరేంద్రుని దగ్గరకు బిలచి యాతనివంక తదేకదృష్టితో జూచుచు ధ్యానవిమగ్నుడు కాగా యేదియో సూక్ష్మశక్తి తరంగ మొండు విద్యుత్ప్రసారమువగిది నరేంద్రునిహృదయమున ప్రవేశించునట్లు తోచి యతడించుకసేపు బాహ్యస్మృతి హీనుడై పిదప తేరుకొనువరకు గురుదేవునికన్నులనుండి బాష్ప ధారలు కురియజొచ్చెను. నరేంద్రుడు విస్మయాకులితదృష్టితో హేతువేమని ప్రశ్నింప, నాయనా! నేడు నీకు నాసర్వస్వము ధారవోసి యాధ్యాత్మిక సంపద్విహీనుడనై ఫకీరునైతిని. ఏతచ్ఛక్తిచే జగంబున నీవు ఘనకార్యముల నొనర్చి పిదప స్వస్థత నొందగలవని పలికెను. ఎవరో యింకొకని కొకపువ్వు మునో ఫలమునో కానుకగా నిచ్చినట్లు తా నార్జించిన యఖండ శక్తిని, అనిర్వచనీయప్రతిభను, అధ్యాత్మికసంపద్వైభవమును లోకకల్యాణార్థ మొక్కశిష్యపరమాణువునకు ధారవోసిన మహా త్యాగి కలడా? త్యాగమున కింతకంటె పరమావధి యేది? అందువలననే నేటికలియుగమున నాపుణ్యమూర్తి సంఘముల పేరిట, విద్యానిలయముల పేరిట మృతజీవుడై వెలసియున్నాడు.

శ్రీరామకృష్ణుని మహాసమాధి కిక రెండు దినములు శేషించియున్న నాటియొకసమయమున చుక్కలు చంద్రుని

వలె శిష్యులాయనను బరివేష్టించియుండ నరేంద్రు డాకస్మికముగా దనహృదయసీమను ఈయన తా నవతారమూర్తినని యనేకపర్యాయములు వచించియుండెను. ఇట్టి దారుణశరీరబాధ నందుచు మరణయాతనాదుర్భరపరిస్థితిలో గూడ దా నవతారమూర్తినే యని పలికిన విశ్వసింతునని యాలోచించి గురుదేవుని యెదుట నిలచెను. కాని నోట మాటరాలేదు. ఇంతలో నాపరమహంస, నరేన్ ! నీ కింకను సంశయనివృత్తి కాలేదా ? ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో, ఆతడే యీశరీరమున రామకృష్ణుడు. కాని నీవేదాంతవిధానమ్మున గాదనుమా యని ప్రవచింప నరేంద్రు డానందములో సిగ్గిలి శిరమువంచెను.

ఆకడపటిదినములు రెండును శిష్యులకు, లోకమున దా మింక తెన్నుగానక మాతాపితృవిహీనులైన బిడ్డలమై పోదుముగదా యనువిచారమున దుఃఖమయము లయ్యెను. కడపటిదినమున నంతిమఘటికలు వచ్చుచున్నవని యెఱింగిన శ్రీరామకృష్ణపరమహంస తుదిఘడియలలో నపరిమితశరీరబాధ నందుచునే నరేంద్రుని జేరబిలిచ్చి తనయంత్యోపదేశ మొనర్చెను. ఆపిదప మువ్మారు కాళీమాతను స్మరించి శ్రావణ కృష్ణ పాడ్యమీ భానువాసరమున నిశీధివేళ యించుమించుగా నొంటిగంటవేళ శ్రీరామకృష్ణు డఖండసచ్చిదానందమయమగు పరబ్రహ్మయం దైక్యమయ్యెను. అది ప్రపంచము నకే దుర్దినము, సుదినము.

---

# ఉపసంహారము.

"అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

శ్రీరామకృష్ణపరమహంస యథార్థముగ మరణించెనా? పరమాత్మస్వరూపుడై, యమృతత్వప్రాప్తి నొందిన యామహాను డెట్లు మరణించును? ఏయుదారుని పవిత్రజీవితము, ఏయాత్మజ్ఞాని పావనమూర్తిమత్త్వము, ఏపుణ్యాత్ముని పరిశుద్ధ నామము, సకలశాస్త్రార్థములకు పుట్టినిల్లయి, ముముక్షువులకు నాదర్శకమై, లోకకల్యాణహేతుభూతమై విలసిల్లుచున్నదో యట్టి శ్రీరామకృష్ణుడు భౌతికదేహమును త్యజించినంత మాత్రాన మృతిజెందె ననవచ్చునా?

అయ్యాధ్యాత్మికజీవనజ్యోతి నేటికిని బేలూరునందును, వరాహనగరమునను, కాశీక్షేత్రమునను, కలకత్తా, మదరాసు మున్నగు మహానగరములలో దేవాలయములు, మఠములు, పూజామందిరములు, సేవాసంఘములు, విగ్రహములు, విద్యాలయములు మున్నగు రూపములలో శ్రీరామకృష్ణుడు భారతదేశమందేగాక పశ్చిమఖండమందుగూడ దివ్యతేజంబుతో విరాజిల్లుచుండెను. పారమార్థికాశయములతో, మహోత్తమ తపశ్చర్యలతో, ఆత్మసందర్శనశక్తి సామర్థ్యములతో ప్రాచీన భారతజాతీయ జీవనగంగాప్రవాహరూపమున సమస్తవేదాంత

సారమూర్తియై, విశుద్ధభక్తిజ్ఞానములను, ఆధ్యాత్మికదివ్యోపదేశములను శిష్యకోటి కందిచ్చి యొకప్పుడు ప్రాచ్యప్రతీచీఖండములను నూతనజాతీయాదర్శకములతో, ప్రకృతిశాస్త్రవిజ్ఞానప్రదర్శనములతో, ఆత్మవిషయకసంశయాత్మకభావములతో స్వీయసనాతనధర్మపునరుజ్జీవకములగు మహోపన్యాసములతో నుఱ్ఱూతలూగించి సనాతనధర్మమును పునః భారతదేశమున ప్రతిష్ఠించి యీశ్వరప్రేరితమహావక్తయని ప్రఖ్యాతి నందిన శ్రీవివేకానందస్వామికి గురుదేవుడనబడిన శ్రీరామకృష్ణుడు ధన్యుడు !

" స్థాపకాయచ ధర్మస్య సర్వధర్మస్వరూపిణే,
అవతారవరిష్ఠాయ రామకృష్ణాయ తే నమః. "

సంపూర్ణము.

Paper Supplied by Party—E. G. 34. Copies 1000.
Sree Satyananda Press, Rajahmundry—E. G. 107. 15-3-1947.

